శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## పరిశీలన, పరిశోధన, అవగాహన




రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"

**శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు**

నర్సాపురం, ప॥గో॥ జిల్లా.

శ్రీగురుభ్యోనమః

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము

## పరిశీలన, పరిశోధన, అవగాహన



రచయిత

"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"


**శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు**

నర్సాపురం, ప॥గో॥ జిల్లా.

# పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము
## పరిశీలన, పరిశోధన, అవగాహన

రచయిత :
"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"
**శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు**
నర్సాపురం, ప॥గో॥ జిల్లా.

ప్రధమ ముద్రణ : 09-04-2008
**"పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద"**
**(శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి**
**ఆరాధన కార్యక్రమం సందర్భంగా)**

కాపీలు : 1000

వెల : రూ. 10/-

ఈగ్రంధములు వలయువారు
**శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిరము**
డో.నెం.: 10-204/ఏ,
**యర్రబాలెం - 522 503.**
మంగళగిరి మండలం, గుంటూరు జిల్లా.
ఫోన్: 08645 - 233140

ముద్రణ :
శ్రీలక్ష్మీగణపతి బైండింగ్ వర్క్సు
మెయిన్‌రోడ్డు, కొవ్వూరు
ఫోన్ : 08813-231575

ఓం
శ్రీ సద్గురుభ్యోనమ:



పరిపూర్ణ దర్శనాచార్య సదానంద
శ్రీ ఋలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు
వీరి సహధర్మచారిణి మాతృశ్రీ సీతామహాలక్ష్మి గారు

గ్రంథకర్త

ఓం

శ్రీసద్గురుభ్యోనమః

ఈ గ్రంథ ముద్రణ దాతలు శ్రీవిజ్ఞానానంద

శ్రీ మంచిరాజ శ్రీనివాస మూర్తి గారి శిష్యులు



**శ్రీ శలా చంద్రశేఖరరావు**

**శ్రీమతి శ్రీదేవి**

**రాజమండ్రి**

## శ్రీగురుభ్యోనమః

# ముందుమాట

పరిపూర్ణ దర్శనాచార్య, సదానంద శ్రీయిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారు, శ్రీఅచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి అనుగ్రహముచే వారి దివ్య ఆశీస్సులచే శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును, తమ గ్రంథ రచనలద్వారా బహుళ ప్రాచుర్యము చేసి, పాఠక లోకమును, ఉత్తేజితులుగా జాగృత మొనరించినారు. వారి శిష్య ప్రశిష్యులు, వలయు ఆర్థిక సంపత్తిని సమకూర్చి, వారి గురుభక్తిని వ్యక్తపరచు కొనుచునే వున్నారు.

అంతేగాక గురు ధర్మ నిర్వహణలో శ్రీరామచంద్రరావు గారి దంపతులు జరిపిన కృషిని, గడపిన ఆదర్శవంతమగు, జీవితమును లోకములో ప్రచారము చేయుటకై, గురుదేవుల ఆశయసంసిద్ధికొరకు "శ్రీశ్రీశ్రీ సీతారామచంద్ర పరిపూర్ణ బోధోపదేశ మందిర సంస్థను" గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, ఎర్రబాలెం గ్రామంలో ఏర్పాటు చేసి, శ్రీ గురుదేవుల ఆదర్శమును లోక కళ్యాణార్థము, వివరించడంలో వారికి గల సహాయ సంపత్తిని అందించు చున్నారు. ఇది సహృదయులు సంతసించి ప్రోత్సహించ వలసిన అంశము. ఇంతే కాక దీనికి అనుబంధ సంస్థలుగా పశ్చిమగోదావరి జిల్లా నరసాపురం పట్టణములోనూ, నిజామాబాద్ పట్టణములోనూ, నల్లగొండ జిల్లా గరుడేపల్లి గ్రామములోనూ, మందిర నిర్మాణములు ఏర్పాటుచేసి వున్నారు.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు, వారి గురుదేవులు శ్రీ శివరామ దీక్షితీయ పీఠాధిపతులైన, దయానంద పొన్నాల రాజయోగీంద్రులవారి దివ్య శ్రీ చరణములకు పూజా పుష్పములుగా సమర్పింపబడియున్నవి. అట్లే ఈ భాగం కూడా యొక పూజాపుష్పంగా వారి చరణ సన్నిధి చేరాలని భక్తమండలి వారి తరపున శ్రీగురు పరమాత్మను ప్రార్థించు చున్నాము.

ఇట్లు
భక్త మండలి తరపున
**మంచిరాజు శ్రీనివాసమూర్తి**

# పీఠిక

పరిపూర్ణదర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి రచనలలో మకుటాయమానమైన గ్రంధము "పరిపూర్ణ దర్శనము " ఆగమ నిగమ వుపనిషత్ సాగర మదితార్ధ మవలిదై , యతోవాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ: అనుశృతి న్యాయముగా, ప్రాగర్ధచరమార్ధయోగములకు సంయోగము గావించి గుర్తించినదంతా, (ఈగ్రంధము) పరిపూర్ణ దర్శనం గ్రంధమునందు పొందు పరచి వున్నారు.

శాస్త్రదృస్యం గురుర్వాక్యం తృతీయం ఆత్మ నిశ్చయం,చతుర్ధం సంశయ చ్ఛేదం, పంచమం ముక్తి దాయకం, అను నిర్ణయానుసారం, శ్రీ దయానందుల పాద సన్నిధి, అర్చించి సేవించి, పరిపూర్ణ బోధయందలి విషయ నిరూపణలో సమగ్ర అవగాహనం కలిగించుకొని, ఏతత్ అంశముల సిద్ధాంత పద్ధతిగా సమాజానికి అందించడానికి,చాలా గ్రంధ పరిశీలన, పరిశోధన గావించిరి. అందు ముఖ్యముగా, భారతీయ తత్త్వశస్త్రమునకు, సోపానముగా అత్యంత ప్రామాణికంగా, నిర్దేశంచబడిన, షడ్దర్శనములు వాటికి సంబంధించిన వివరణ గ్రంధములు, ఈదర్శనములందు చివరి గమ్యమైన వేదాంతం (అద్వైతసిద్ధాంతము) వాటికి అనుబంధముగా రచింపబడిన ప్రకరణ గ్రంధములు. పరశీలనాత్మకంగా, పరిశోధించి, అందలి ముఖ్యాంశములు పరిపూర్ణదర్శన గ్రంధరచనకు, సహాయ్యపడుట పట్ల ఎంతో శ్రమ పట్టుదల ఆశక్తి కనబరచి, విశేష కృషి జరపియున్నారు. ఏలననగా పరిపూర్ణ సిద్ధాతం "విద్యాంతం, బ్రహ్మవిద్యాంతం వార్తికాంత మగోచరం పూర్ణబోధ ప్రవిష్యామి, శృణు శిష్యామహోత్తమమ్" అని శూత్రీకరింపబడుటయే.

అట్టి పరిశీలనలో ముఖ్యముగా, జిజ్ఞాసికి కావలసిన పెక్కు, జ్ఞాన, యోగ, భక్తి, మత తంత్ర, మంత్ర, అంశములు చిన్న చిన్న వ్యాసముల రూపములో వారు గ్రంధస్తమొనరించి వున్నారు. ఏతత్ విషయములు పరిపూర్ణ బోధనుగూర్చి సమగ్ర అవగాహన కలిగించు కొనుటకు పాఠకులు ప్రయత్నించుపట్ల. పై అంశములు, సహాయ భూతములుగా నిలువ గలందులకు ఒక పరిశీలన గ్రంధముగా శ్రీరామచంద్రరావు గారు "పరిపూర్ణబోధ పరిశీలన, పరిశోధన, అవగాహన" అను పేర పెక్కు అంశములు గ్రంధస్తము చేసి, పాఠక లోకమునకు అందించడమౌతున్నది. అందు ప్రధమసంపుటగా పాఠకలోకమునకందించడమైనది. ఈచిన్న ప్రయత్నాన్ని పాఠకలోకము స్వీకరించి, సిద్ధాంత అవగాహనపట్ల నిర్దుష్టమైన అవగాహన కలిగించుకొన్నచో ఈ రచన వుద్దేశ్యము ఫలప్రదమైనట్లే. ఈగ్రంధము కూడా భక్తాయుల ఆర్ధిక సహాయమున ముద్రించబడెను. వాని వివరణ అన్యత్రా ప్రకటింప బడును.

శ్రీ రామచంద్రరావు గారి రచనలన్నియు. వారి గురుదేవులైన శ్రీ మదచలఋషి దయానంద పొన్నాల రాజయోగీంద్రుల దివ్యశ్రీ చరణములకు పూజాపుష్పములుగా సమర్పింపబడియున్నవి. ఎతత్వత్తుగా ఈ సంపుటముగూడా, శ్రీవారి సన్నిధికి చేరాలని భక్తమండలి తరుపున,

ఇట్లు
మంచిరాజు శ్రీనివాసమూర్తి

# శ్రీగురుభ్యోనమ:

ఈ గ్రంథ ముద్రణకు ద్రవ్య సహాయమొనరించిన శ్రీ శలా చంద్రశేఖరరావు శ్రీదేవి గార్ల సంగ్రహ జీవిత చరిత్ర

శ్రీ శలా కోటయ్య భువనేశ్వరి దంపతుల తృతీయ సంతానముగా శ్రీ శలా చంద్రశేఖరరావు గారు 13-7-1960 లో జన్మించిరి. శ్రీ కోటయ్య గారు రైల్వే లో విశాఖపట్నం లో ఉద్యోగం చేస్తూ స్థిరపడినారు. చి॥ చంద్రశేఖర రావు విద్యాభ్యాసము అంతా విశాఖపట్నంలోనే జరిగింది. వీరు సివిల్ ఇంజనీరింగ్ ఆంధ్రా యూనివర్సిటీ ఇంజనీరింగ్ కళాశాలలో పూర్తిచేసి తరువాత ఎమ్.టెక్ ఐ.ఐ.టి బొంబాయి నందు పూర్తి చేసినారు, తరువాత ఇరిగేషన్ డిపార్టుమెంటు నందు ఇంజనీర్‌గా చేరి ప్రస్తుతం రాజమండ్రిలో ఉద్యోగరీత్యా నివసించుచున్నారు. వీరి సహధర్మచారిణి చి॥సౌ॥ శ్రీదేవి ఈమె పరిపూర్ణ దర్శనాచార్య సదానంద శ్రీ యిలపకుర్తి రామచంద్రరావుగారి శిష్యరత్నములైన శ్రీ సమతం వీర సుబ్బారావు, బాపనమ్మగార్ల ద్వితీయ సంతానమైన శ్రీ సమతం నాగలింగం మాణిక్యాంబ గార్ల తృతీయ సంతానము. ఈమె 6-8-1966లో జన్మించినారు. వీరు బి.ఎస్.సి. వరకు విద్యాభ్యాసము చేసినారు. వీరికి 1987వ సంవత్సరములో వివాహము జరిగినది. వీరికి ఒక కుమార్తె చి॥ శ్రీవిద్య, కుమారుడు చి॥ శివచైతన్య కలరు.

శ్రీ చంద్రశేఖర్ గారితల్లి దండ్రులు శ్రీ శలా కోటయ్య, భువనేశ్వరిదంపతులు, చి॥సౌ॥ శ్రీదేవి తల్లిదండ్రులు శ్రీ నాగలింగం మాణిక్యాంబ దంపతులు ఆధ్యాత్మిక సాధనలో చక్కగా కృషిచేయుచున్న సందర్భములో వారిప్రేరణ వీరి ఇరువురిపైనా సంక్రమించి అందుకు వలయు సరియైనమార్గము జన్మరాహిత్య విధానమునందు శ్రీ శివరామ దీక్షిత సాంప్రదాయము ప్రముఖమైనదిగా గుర్తించి శ్రీ రామచంద్ర రావుగారి శిష్యులైన శ్రీ మంచిరాజు శ్రీనివాస మూర్తి, సుగుణావతి గార్ల ద్వారా 1999 సం॥ లో శ్రీశైలంలో మంత్రదీక్షగైకొని సాంప్రదాయ పద్ధతియందు నిర్దేశించిన అనుష్టాన, ఆచరణ, విచారణ పద్ధతియందు కృషిచేస్తూ ఆదర్శవంతమైన జీవనవిధానము కలిగియున్నారు.

శ్రీ రామచంద్రరావుగారి రచనలన్నియు శ్రీ శివరామ దీక్షితీయ సాంప్రదాయమును విపులపరచుట పట్ల సమాజమునకు ఎంతో ప్రాచుర్యమును కలిగించి పాఠక లోకమును సాంప్రదాయ అవగాహనపట్ల ఉత్తేజితులను కావించియున్నారు. అట్టిరచనలలో " పరిపూర్ణ దర్శనము " అనుగ్రంధము విశేషముగా చెప్పవచ్చును. ఇట్టి గ్రంథపరిశోధనలో శ్రీ రామచంద్ర రావు గారు విభిన్న మతముల గ్రంధములు పరిశీలించి ఒక సమగ్రమైన అవగాహనపై గ్రంథరచన గావించి యున్నారు. అట్టి అవగాహన ప్రయత్నములో వారిరచనలో అముద్రితముగానున్న వివిధరచనలలో విభిన్న అంశములు క్రోడీకరించి పాఠకలోకానికి అందించుటకు ఈచిన్న ప్రయత్నము. ఈ గ్రంధప్రచురణకు ఆర్థిక సహాయము అందించిన చి॥ శలా చంద్రశేఖర్, చి॥సౌ॥ శ్రీదేవిగార్లను శ్రీ గురుపరమాత్మ సమస్త శుభములు కలిగి యిహపరముల యందు చక్కటి ఆరూఢత కలగాలని, ఆశీర్వదించాలని కోరుతూ...

ఇట్లు
**సమతం నాగలింగం**

# విషయసూచిక

# 1. ధ్యాన సూత్రములు

1) ధ్యానమునకుపక్రమించునపుడు మొదట కొంచెముసేపు సుస్థిరముగా కూర్చుండి నీమనోగతినిపరికించుచుండుము. దానిని స్వేచ్ఛగా సంచరింపనిమ్ము. నీవు సాక్షి వని, ద్రష్టవని భావించుకొనుము. మనసు తేలియాడుటను , మునుగుటను, పరుగులిడుటను , గంతులిడుటను కనిపెట్టి చూచుచు కూర్చుండుము. నేను శరీరమునుకాను, ఇంద్రియములను కాదు, మనస్సునుకాను, నాకామనస్సు కేవల భిన్నవస్తువు. మనస్సు సైతము భౌతిక వస్తువే సూక్ష్మ తరమగు భౌతికవస్తువు, నేను ఆత్మను ప్రభువుడను. మనస్సు నాకు బంటు.

2) చిత్తైకాగ్రత సాధించుటకు అభ్యాసము, వైరాగ్యము తప్ప వేరు ఏ మార్గము సులభము అనుకూలము అయినదిలేదు.

3) జపధ్యానములకు నీవు వినియోగించు కాలమెంతయైనను, పదినిమిషములో పదునైదు నిమిషములో మాత్రమేయైనను, వానియందు నీమన:ప్రాణములను పరిపూర్ణముగా నుంచి చేయుము. ఆయన చూచునది నీ హృదయమును. నీలోని వాంఛ ఎంత ప్రబలంగా నున్నదో అనునదియే ఆయనకు ముఖ్యము.

4) జపధ్యానములవిరామ పరిశ్రమకొంతకాలము అనుష్టించుట వలన చిత్తము శాంతి పారిశుద్యములా ర్జించినపుడు నీచిత్తమే నీకు గురువు.

5) జపము చేయునపుడు నీ ఇష్టమూర్తి (గురువు) యొక్క రూపమును ధ్యానించుచుండుము. సాధనలు జరుపుకొలది సిద్ధిచేకూరగలదు.

6) జపమును (అనుష్టానమును) వ్రేళ్ళపై లెక్కించుట జపమాలను పయోగించుట స్మరణ ఎన్ని సార్లు చేసినది లెక్క యుంచుకొనుట ఇవన్నియు మనస్సు నితరవస్తువుల నుండి మరల్చి ఇష్టదైవముపై కేంద్రీకరించుటకై ప్రారంభదశలో అవలంబింపబడు మార్గములు. ఇట్లు చేయనిచో మనస్సు అన్యవిషయముల మీద కెపుడు పారిపోవునో నీవెరుగ జాలవు. నీకు కునికిపాట్లు కలిగినను కలిగి యుండవచ్చును.

7) సాధకుడు దీర్ఘకాలము సుస్థిరముగా ధ్యానోపవిష్టుడై యుండవలెను. వెన్నెముకవంచక తిన్నగా నిలచి యుండవలెను. గూనుగా వంగి కూర్చొనుట ఆరోగ్యకరము కూడాకాదు.

8) ప్రపంచము అవాస్తవికమనియు, క్షణభంగురమనియు, బ్రహ్మమొక్కటే సత్యమనియు హృదయమునందు సుస్థిర విశ్వాసమేర్పడువరకును ధ్యానవేళయందు నీ మనస్సు చలించుచునే యుండును. ఇంద్రియ భోగతృష్ణ ఎంతమేరకు తరిగిపోవునో అంతమేర ఈశ్వరప్రేమ పెరిగి మనస్సు శాంతిల్లును. ఈశ్వరానుభూతి అణుమాత్రమేని లభించిన యెడల ఐహిక భోగములు తుచ్ఛములుగా నుండును.

9) ఈశ్వరుడు తన అపార కృపా విశేషమున గురువుద్వారా సిద్ధి మంత్రమును తన గర్భగృహద్వారమును తెరచు తాళపు చెవి నీకందచేసినప్పుడు ఆయన నీకు తన్ను పూర్ణము ఇచ్చివేసుకొనెనని ఎరుగము. కాని నీ వావిషయమును ధృఢముగా నమ్మియుండుట అత్యంత

ముఖ్యము. అజాగ్రత్త వలన ఆ అమూల్య మణిని కోల్పోయితివేని నీవాయన అనుగ్రహము నొందుటకు అపాత్రమగుడవని ఎరుగుము. శక్తి వంచన ఏమాత్రమును లేక త్రికరణ శుద్ధిగా మంత్రమును జపించుచు, గురుని ఉపదేశములను తప్పక పాటించుట యే ఆయన ఋణమును కొంతవరకైనా తీర్చుకొను మార్గమదొక్కటియే.

10) ధ్యానకాలమున దేహాత్మ బుద్ధిని అనగా నీవే ఈ దేహము అను భావమును మరచిపొమ్ము.

11) గురువునందు త్రికరణశుద్ధితో కూడిన భక్తి, శ్రద్ధ యుండినగాని పారమార్థిక మార్గమున పురోగమించుట అసాధ్యము. సత్యానుభూతినొందగోరితివేని గురూపదేశమును పరిపూర్ణముగా అనుసరింప ప్రయత్నింపుము.

12) నీవు స్వయముగా గాఢ పరిశ్రమము చేసిన గాని గురువు నీకు సత్యానుభూతి కలిగింపజాలడు. గురువు మార్గమును చూపగలడు. సందేహములను తీర్చగలడు. తప్పుత్రోవ బట్టితివేని హెచ్చరింపగలడు. సరియైన త్రోవలో మరల నిల్పగలడు. కాని నడచుట నీవే చేయవలసినపని.

13)ముందుకు నడువుము. ముందుకు సాగుము. ఇటునటు చూడవలదు. జ్యోతిర్దర్శనాది యోగసిద్ధులు లభించినచో వాని విషయమే పట్టించుకొనవలదు. ధ్యానమభ్యసించుకొలది వివిధ యోగ సిద్ధులు తమంతట తామే లభించును. కానీ వానినంటుకొని అచటనిలువ వలదు. ఎల్లపుడు గమ్యము మీదనే నిలిపియుంచుము. ఈ జీవితమునందే ఆయనను సాక్షాత్కరించుకొనుట ఎట్లు అనునదే నీ ఏకైక వాంఛయు, లక్ష్యమును అగుగాక.

14) జపములు(అనుష్టానము) హృదయము నుండి చేయబడునవి సిద్ధించుట నిస్సంశయము.

15) తండ్రి తన పుత్రుని, గురువు తన శిష్యుని తనకన్న అధికతరుడు కాగోరును.

16) ప్రారంభదశలో నుండు సాధకుడు నిత్యజాగరూకుడై ఏమరు పాటు లేక యుండవలెను. ఏదో యొక జ్ఞానసిద్ధిప్రాప్తించువరకు ప్రారంభదశయే.

17)తనకుతాను మిత్రుడై యుండువాడు లోకమునకు మిత్రుడు. లోకమంతయు అతనికి మిత్రము. అనగా పరిశుద్ధచిత్తము ముక్తి కారణము. అపరిశుద్ధ చిత్తము బంధకారణము.

18) శ్రద్ధాసక్తి సంపన్నుడగు గృహస్థు భక్తుడు సాధన లంతగా అనుష్టింపకున్నను ఆదర్శమును తప్పి పతనము నొందిన సన్యాసికన్న వేయిరెట్లు శ్రేష్టుడు.

19) సిద్ధిపురుషుడైన గురువు గురుపారం పర్యముగా వచ్చుచుండిన మంత్రమునే యోగులు, ఋషులు స్మరించి సంసిద్ధినొందినదానినే శిష్యులకుపదేశించును. అభ్యసించి నను మనస్సు ఏకాగ్రము పరిశుద్ధము కానియెడల ఆ లోపము మంత్రము లోనిదని యెన్నరాదు. లోపము నీలోనిదే అని ఎరగవలెను.

20) సాధనలకు యౌవనము శ్రేష్ఠముతరుణము. ఆకాలమున గాఢముగా పరిశ్రమించి వలయునంతటి పారమార్థిక శక్తిని సముపార్జించుకొను సాధకుడు పతన భీతి విస్తారము లేక శాంతి సుఖములతో తనజీవిత శేషమును గడుపుకొనవచ్చును. ఎన్ని కష్టములు ఎన్ని విపత్తులు ఎదుర్కొన్నను అతడు నిర్భయుడై యుండును.

21) జ్ఞాన మార్గమున ప్రప్రధమమునుండి ప్రతివస్తువు యొక్క ఉనికిని నిరాకరించు చుండవలెను.

22) నీ పరిపూర్ణ శక్తితో జపతపములు హృదయ పూర్వకముగా నభ్యసింపుము. కాని ఈశ్వర సాక్షాత్కృతి (తాను ఈశ్వరుడనే భావము) గురువు అనుగ్రహ మూలమున మాత్రమే లభింపగలదు.

23) జీవిత తాపత్రయముచే వేగుచుండు జీవుని ఈశ్వరునివైపునకు, శాంతి దిశకు తీసుకొని పోవువాడే గురువు. గురువు శిష్యునికి పరతత్వమును చూపి జనన మరణముల నుండి విముక్తి చేయును. గురుఋణము అతడు అవిద్యనుండి తొలగించును గనుక తన సర్వస్వము యిచ్చినను తీరదు.

24) ఆ అకృత్రిమ (ఆత్మ) విశ్వాసముతో హృదయ పూర్వకముగా భగవంతుని ఆవాహనచేసి ఆయన యొద్ద మరేమియు కోరకయుండు వాని కాయన దర్శనము లభించును. లౌకిక వస్తువుల నిమ్మని అర్థించు వారికి ఆయన సంకల్పించెనేని అవి లభించును కాని ఆయన దర్శనము సిద్ధింపదు.

25) జ్ఞానయోగి యొక్క త్యాగము అత్యంత కష్టము. ఏలయన అతడు ప్రప్రధమమునుండి ఈ అఖిల ప్రపంచము దానిలో తనకుగల సంబంధము అయదార్థము మాయ యనియు, నేను దేహమునుకాను, మనస్సును కాను, ఇంద్రియములను కాను, నాకు సుఖ దు:ఖములు జనన మరణములు బంధముక్తులు లేవు, నేను అఖండ బ్రహ్మమును, పరమాత్మను, చైతన్య స్వరూపుడను, నిత్యశుద్ధుడను, నిత్యబుద్ధుడను, నిత్య ముక్తుడను ఇది అతని మార్గము. ఎరుకతో నతడు తన యదార్థతత్వమగు ఆత్మపై బాహ్య వస్తువులనెల్ల విడనాడి ధ్యాననిమగ్నుడు కావలెను.

## 2. దేవీ నవరాత్రములు

దేవీ నవరాత్రములనగా నేమి? యేకాలమున యెందుకు ఈఉత్సవములు జరుపవలెను? ఈ ఉత్సవములయందు జరగవలసిన కార్యక్రమమేమి? ఈ యుత్సవములవలన ప్రయోజనమేమి? అట్టి ప్రయోజనము యీ యుత్సవముల జరుపుట వలన సిద్ధించుచున్నదా? సిద్ధించకపోవుటకు కారణమేమి? సర్వమానవ కర్తవ్య స్వరూపమగు మోక్షప్రాప్తి అనగా శాశ్వత జనన మరణభ్రాంతి రహితమునకు ఈ దేవీ నవరాత్ర దీక్ష యెంతవరకు సహాయకారి యగును? అను విషయములను గూర్చియించుక విచారింతము.

### నామమీమాంస

శైవమతాభిమానులకు గణపతి నవరాత్ర దీక్షలును, వైష్ణవ మతాభి మానులకువసంత నవరాత్రములు పిదప సీతారామ కళ్యాణ మహోత్సవములును ఆదర్శనీయములై యున్నవి. కాని ఉభయులు దేవీ నవరాత్ర మహోత్సవములను సమానముగా నాదరింతురు. వైష్ణవ సాంప్రదాయకులు మహాలక్ష్మీ పూజా విధానములను, శైవ మతాభిమానులు దుర్గా పూజా మహోత్సవములను గావించుకొందురు. ఈ దేవీ నవరాత్రములు వెన్నెల వైభవములతో వెల్లి విరియు సర్వమానవులకు ఆనందప్రదమగు శరదృతుప్రారంభమున జరుపబడుటచే శరన్నవరాత్రములని పేరుకూడా వచ్చెను.(వసంతారంభమున వచ్చు వానికి వసంత నవరాత్రములని పేరు వచ్చినట్లు గానే)

ప్రతిసంవత్సరము శరదృతువు లో ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి మొదలు నవమి వరకు తొమ్మిది దినములు దీక్షవహించి పూజా కార్యక్రమములు జరిపింతురు. పదియవదగు దశమికి దశహరమను పేరు కలదనియు, దశహరా యనునది కాలక్రమమున " దశరా" లేక " దసరా" అనుపేరుగా రూపాంతరము చెందెననియు కొందరందురు. దశమితో పదిరాత్రులు కనుక దశరాత్రులు అగుటకు బదులు దశరా లేక దసరా గా రూపొందెననియు చెప్పవచ్చును

## నవరాత్రిపూజాదికము లెందుకు?

సంవత్సరములో ఘటిల్లు అరిష్టములలో ఎక్కువ భాగము ఈ శరదృతువు నందే సంభవించుట ప్రసిద్ధమై యున్నది. పాత పంటలు ఖర్చైపోయి క్రొత్త పంటలు రాని కాలము. ఈకాలమున మరణముల సంఖ్యయు హెచ్చు. అతివృష్టి దోషములు గాలివానలు మెండు. ఈప్రకృతి వైపరీత్యములచే రాబోవు పంటలకు విశేష నష్టము సంభవించు కాలము గనుక యీ యరిష్ట దోష పరిహారణార్థం యీ ప్రకృతిశక్తుల ఆరాధన ప్రారంభింపబడెను అని ఊహింపవచ్చును.

మరియు పూర్వము మహిషాసురుడు లోకములను బాధించు చుండగా శక్తి చాముండి రూపము వహించి విజయదశమినాడే మహిషాసుర సంహారము గావించెననియు, ఆశ్వయుజ శుద్ధ దశమి దినమున రావణసంహారమును జరిగెననియు, అర్జునుడు ఉత్తరగోగ్రహణ యుద్ధమున ఉపయోగించిన ఆయుధములు ఈ దశమి దివసముననే శమీవృక్షము నుండీ గ్రహించి యుద్ధము చేసి జయించెననియు, కురు పాండవ యుద్ధమున జయము గాంచుటకై తొలుదొల్త శ్రీకృష్ణోపదేశముతో అర్జునుడు దుర్గాపూజ గావించెననియు మొదలగు పెక్కు పురాణగాధలు గలవు. ధర్మ పద్ధతినే గావింప బడు పూర్వ యుద్ధములలో ఉభయ సైన్యములు వర్షఋతువు కాలమున విశ్రాంతిచెంది ఈ నవరాత్రములలో ఆయుధపూజ గావించి యుద్ధయాత్రలకు వెడలుచుండిరి. ఆ చిహ్నముగానే నేటికిని మన బాలురచే విల్లమ్ములు పట్టించి బడిపంతుళ్ళు ఊరేగింపులు చేయించుట జరుగుచున్నది. పై కారణముల వల్లను, అపరాజిత (అనగా ఓటమి చెందరానిది) అను శక్తికి జయ విజయులే పార్శ్వదేవతలుగా నుందురని వర్ణింపబడినది. కనుక ఆశ్వయుజ శుద్ధ దశమికి విజయ దశమి అను నామము చేకూరినదని చెప్పవచ్చును. కనుక యీ నవరాత్రి పూజలు యుద్ధములందు జయమును గోరి చేయబడుచూ వుండెననియు నూహింపవచ్చును.

## ఆరాధ్య దేవత లెవరు

సర్వాంతర్యామి యొక ఈశ్వరుడే. సత్వ రజస్తమ గుణభేదములచే బ్రహ్మ విష్ణు రుద్ర రూపములుగా భావింపబడిన రీతిగానే ప్రధాన దేవతయగు దుర్గయే లక్ష్మి, సరస్వతి, మహేశ్వరీ రూపముగా భక్తాదులచే భావింపబడి సేవించబడు చున్నది. ధనమును గోరువారు మహాలక్ష్మి రూపముగాను, విద్యనుగోరువారు సరస్వతీ రూపముగాను, అరిష్ట నాశనమునకు మహేశ్వరి రూపముగాను యితర సంకల్పసిద్ధికి దుర్గా స్వరూపము గాను భక్తులు శక్తి పూజలు గావింతురు. ఒక్కొక్క ప్రధాన విషయమును గోరి ఆ విషయమును సిద్ధింపజేయ గల నామరూపములు గల శక్తిని భావనచేసి భక్తులు సంకల్ప సిద్ధిని గావించు కొనుచున్నారు. ఆర్య, కుమారి, కాళి, కాపాలి, భద్రకాళి, మహంకాళి, కాత్యాయని,దుర్గ, సావిత్రి, సరస్వతి, గాయత్రి,మహాలక్ష్మి, చండిక,

చాముండి,భైరవి, శాంభవి, మొదలగు నామములుప్రసిద్ధములై యున్నవి. " భిన్న రుచిర్హిలోక:" " లోకో భిన్నరుచి:" అనురీతిగా భక్తులు ఆశయ అభినివేశముల కనువైన ఆరాధ్య దేవతను వారివారికి ప్రేమపాత్రమగు నైవేద్యాదికము లొసంగి పూజింతురు కనుకనే శాక్తేయమున వామాచార శిష్టాచారములు ప్రబలినవి.

## నవరాత్రు దీక్షా కార్యక్రమము

ఈతొమ్మిది దినములలో 1) కలశ స్థాపన 2) దేవతాపూజ 3) సప్త శత్యాది జపము 4) అఖండదీపము 5) మాలాబంధము 6) ఉపవాసము ఏకైక భుక్తము మొదలగునవి 7) సువాసినీ భోజనము 8) కుమారీభోజనము 9) స్తోత్ర మంత్ర, హోమములు జరుపుట విధి విహితముగాచెప్ప బడినవి. యిందు దేవతా పూజ అనగా శక్తి పూజ ప్రధానమును, మిగిలినవి అంగ భూతములును అయియున్నవి. యిందు ఎనిమిదవది కుమారీభోజనము అనగా రెండవ సంవత్సరము మొదలు పదవ సంవత్సరము లోపు వయస్సు గల కన్యలకు భోజనమిడుట. వయస్సు నుబట్టి కన్యలకు వరుసగా 1. కుమారి 2. త్రిమూర్తి 3. కల్యాణి 4. రోహిణి 5. కాళిక 6.చండిక 7. శాంభవి 8. దుర్గ 9. సుభద్ర అని పేర్లు. ఈ కన్యకలను భోజన వస్త్ర భూషనాదులచే తృప్తి పొందించి పూజాదికము లొనర్చుట వలన సర్వవ్యాదులు నివారణ యగునని ఫలశ్రుతి చెప్పును.

## అష్టాదశ పురాణములు - దేవీ భాగవతము

దేవీ మహాత్యమును వర్ణించు చరిత్రము గల గ్రంధము దేవీ భాగవతము యిది అష్టాదశ పురాణములు.

**శ్లో॥ "మ"ద్వయం "భ"ద్వయంచైవ"బ్ర"త్రయం"వ"చతుష్టయం**
**'అ',నా,ప, లిం, పురాణాని కూ,స్కం,గరుడమేవచ॥**

"భ" ద్వయం అనగా భవిష్యత్ పురాణము, భాగవతము అను రెండింటిలో భాగవతము అనునది దేవీ భాగవతమని కొందరును, కాదు శ్రీమద్భాగవతమని కొందరు ఇలా వాదించు చున్నారు. ఐనను అష్టా దశ పురాణములు రచనా నంతరము కూడా వ్యాసునికి మనశ్శాంతి లేకపోయెననియు అందుపై నాతడు శ్రీ మద్భాగవతమును రచించెననియు నొక ఆధ్యాయికగలదు. అందుచే దేవీ భాగవతము 18 పురాణములలోనిదే అనుటయే న్యాయము. మరియు మిగతా పురాణములలో గల శంకలన్నింటికి యీపురాణము నందు సమాధానము లొసంగబడినవి. ఉదా:- రాజసూయ మహాయాగమును విధియుక్తముగా భగవానుడగు శ్రీకృష్ణ సన్నిధానమున మహాఋష్యాదులు ఆధ్వర్యమున జరిపిన పాండవులకు రాజ్య భ్రష్టత్వము అవమానాతి రేకము వనవాసము తటస్థింపనేల? అను ప్రశ్న కు దేవీ భాగవతమున ఇతర రాజన్యుల కొల్లగొట్టి తెచ్చిన ద్రవ్యమందలి దోషమే కారణమని సమాధానమీయబడినది. కనుక దేవీ భాగవతము మిగతా పురాణగాధలను అనువదించి చెప్పుటవలన వాని కనుబంధముగా చెప్పిననే యుక్తియుక్తము.

ఈ దేవీభాగవతమున దేవియే సృష్టి స్థితి లయ ములకు కర్తగాను త్రిమూర్తులను సహితము శాసించి పాలించు మహా జననిగాను వర్ణింపబడినది. "ఇతిహాస పురాణాభ్యం వేదార్థ ముపబృహయేత్"

ఇతిహాస పురాణములు అందలి దేవీభాగవతము వేదసారమగు పరబ్రహ్మ తత్వమును తెలుపుటకే ముఖ్యముగా ప్రవర్తిల్లెను. అది యెట్లో ముందు గమనింతము.

## నవరాత్రి దీక్ష విధించుటకు కారణము

సంఖ్యానీకమంతయు 1 లగాయతు 9 అంకెలలోనే యిముడుచున్నది కనుక తొమ్మిదింటిని చెప్పిన సమస్తమును చెప్పి నట్లే యగును. నవ శక్తుల స్థాన స్వరూప స్వబావాదులను గుర్తించినచో విశ్వగతమగు అనంతశక్తులను తరచిచూచినట్లే యగును. యీ నవ విధ శక్తు లేవనగా 1. క్రియాశక్తి 2. ఇచ్ఛా శక్తి 3. జ్ఞానశక్తి 4. ఆది శక్తి 5. పరాశక్తి 6. చిచ్ఛక్తి 7. సహజాత్మ శక్తి 8. ఉన్మనీ శక్తి 9. మనోన్మని శక్తి వీనికి స్థాన ములు వరుసగా ఆధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రార, కర్మచక్ర, కాలచక్రములు నిర్ణయింపబడినవి. మరియు పిండాండ బ్రహ్మాండములయందీ చక్రములను తెలియ వలెను. నవవిధ ద్రవ్యములు నవగ్రహములు నవఖండములులేక నవద్వీపములు నవరత్నములు నవద్వారములు చెప్పబడుచున్నవి. అందుచే నవ అను తొమ్మిది సంఖ్యకు ప్రత్యేక ప్రాముఖ్యమీయబడి నది. అసలు నవ విధమగు ప్రకృతి పదార్థ స్పందనముచే యేర్పడిన వాడే మానవుడు. మా+ నవ = మానవ అగుచున్నది మరియు గీతాశాస్త్రము కూడా నవ విధ ప్రకృతులను సూచించుచున్నది.

**4. "భూమి రాపోనలో వాయు: ఖం మనో బుద్ధిరేవచ।**
**అహంకారం యతీయం మే భిన్నా ప్రకృతి రష్టదా ॥** *భ॥గీ॥ వి॥యో॥ 4శ్లో*

అపరేయస్త్రమిత స్త్వన్యాం ఇది అంతయు అపరా ప్రకృతి. అష్టవిధ ప్రకృతులివియే పంచభూతములు, సమిష్టి మనో బుద్యహంకారములు. ఈ యెన్మిదియు కలిసి అపరాప్రకృతి.

**5. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధిమేపరాం।**
**జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్॥**

పై 4వ శ్లోకములో చెప్పబడిన అపరా ప్రకృతి నీచమైనది. దానికి వేరైఉత్తమమై యీ జగత్తును ధరించునది యేదియో అది నా ప్రకృతి అని పరా ప్రకృతి గా వర్ణింప బడినది. కనుక పర, అపర అను నీ రెండు కలిసి మొత్తము 9 ప్రకృతులుగా నున్నది.యీ నవ ప్రకృతులే పైనవివరించిన నవ విధ శక్తులై యున్నవి.కనుక యీ నవ విధ శక్తులను లేక ప్రకృతులను ఆరాధించుటకై నవరాత్ర దీక్ష విధించబడినది.

## మూర్తి పూజ లేల?

పై వివరణములను బట్టి నవరాత్ర దీక్ష నవవిధశక్తులు లేక నవవిధ ప్రకృతులను ఉపాసించుటకై ఏర్పడినదని గమనిస్తున్నాము. అయితే సగుణ రూపములై నానా నామ రూపములుగల ఈ మూర్తి పూజలేల? అను సందేహము కలుగవచ్చును. ఇందుకు నా జవాబు ఏమనగా సర్వేశ్వరుడై సర్వాంతర్యామి యై నామరూపములు లేని పరమాత్మను బ్రహ్మ విష్ణ్వాది రూపములతో ఏల ఉపాసించుచున్నారో అట్లే ఈ దేవీ పూజలున్ను ప్రవర్తిల్లినవి. సగుణారాధన వ్యర్థమని ఎంతటి మూర్ఖుడును అనజాలడు.ఏలనన

శృతి: "ఉపాసకానాం హితార్థాయ బ్రహ్మణో రూపకల్పనా" అని ఘోషించుచున్నది. ఉపాసకుల సౌలభ్యం నిమిత్తం బ్రహ్మమునకు ( నిర్గుణమై నామరూప రహితమై యున్న దానికి ) రూపకల్పన గావింపబడెను.

అట్లే శక్తి యనుట లోనే దానికి రూపము, ఆకారము, వర్ణము ఇత్యాదులుండజాలవు. ఉదా:- విద్యుచ్ఛక్తికి -- రంగుగాని, పొట్టి పొడుగులు గాని, ఆకారముగాని ఏమైనగలవా? లేవు. కనుక శక్తి ఎప్పుడును నిరాకారమే. దాని ఆవరణ భూతమై యున్న వస్తువు నకు రూపము. ఆకారము మొదలగునవి ఉండవచ్చునే గాని శక్తి వస్తుత: నిరాకారమే. దానికి రూపాదులు గల్పించి నానావిధ నామ నటనలు గల్పించుట ఉపాసకుల సౌకర్యార్థమే అని గుర్తించనొప్పును.

## దేవీ పూజా ప్రాశస్త్యము

పరబ్రహ్మమునకు లింగ భేదములేదు. అయినను దానిని కొందరు పురుషునిగాను మరికొందరు స్త్రీ గాను అనగా ప్రకృ తి గాను భావించుచువచ్చిరి. ఉత్పత్తికి స్త్రీ పురుష లిర్వురును సమాన కారణముగా నున్నను గర్భము ధరించి నవ మాసములు మోసి స్థన్యమిచ్చి పెంచు మాతృమూర్తియే ప్రధాన కారణముగా కొందరు ఎంచుట సహజము. ఏలననగా మాపొలము గరిశె ధాన్యము పండినదని చెప్పెదరు గాని మావిత్తనములు వలన గరిశె ధాన్యము పండినదని యెవరుననరు. అట్లే విశ్వసృష్టికి పురుష ప్రకృతులు రెండూ కారణముగా నున్నను ప్రకృతియే ప్రధాన కారణమని కొందరు ఉద్ఘాటించుచున్నారు. అందుకే మూలప్రకృతికి ప్రధానమని కూడా నామాంతరము కలదు. మరియు తల్లి దండ్రులిరువురిలో బిడ్డల నెక్కువగా ప్రేమించునదెవరు? తండ్రి కి ప్రేమ యున్నను తప్పుకు బిడ్డలను దండించును. మాతృమూర్తి యన్ననో శాంతమునకు దయకు పుట్టినిల్లు. తల్లి తన ప్రాణమైనను యొడ్డి బిడ్డలను రక్షించుకొనుట పశుపక్ష్యాదులనుండి మానవుల పర్యంతము గమనించుచున్నాము. అటువంటి మాతృశ్రీని ఆరాధించినచో యెంత సులభముగా కామ్యసిద్ధిని పొందవచ్చును. కనుకనే దేవీ పూజలు ఎక్కువగా వ్యాపకము పొంది యున్నవి మరియు త్రిమూర్తులను పూజించుట కంటే వారి యుత్పత్తికి హేతుభూతమగు జగజ్జనని నారాధించుట ఎంత యుత్తమము. అందుకే పోతనామాత్యుడు భాగవతములో కవిత్వ సంపదకై ఆజగజ్జననిని ఇట్లు ప్రార్థించి యున్నాడు.

**ఉ॥ అమ్మలగన్న యమ్మ ముగ్గురమ్మల మూలపుటమ్మ చాల పె**
**ద్దమ్మ సురారులమ్మ కడుపారడి బుచ్చినయమ్మ నిన్ను లో**
**నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా**
**యమ్మ కృపాబ్ధి నీవు తమ హత్వ కవిత్వ పటుత్వ సంపదల్॥**

మరియు ఎంతటి ధీమంతులైనను ప్రకృతికి వశులై మానవ ప్రకృతిని జయించలేక ఇంద్రియ విషయలోలులై పరమాత్మను చేరలేకున్నారు కనుక యీ ప్రకృతి మాతనే సేవించి ఆమె కృపకు పాత్రులై ఉత్తీర్ణులు కావలసి యున్నందున కూడా ప్రకృత్యారాధన అవసరముగా నున్నది.

తత్వ విచారణ

అగ్ని యందలి ఉష్ణశక్తి అగ్నికి వేరు కానట్లు, అధిష్టాన పరబ్రహ్మమునందలి చేతనశక్తి వీడియుండదు. ఈచేతన శక్తికే పరా ప్రకృతి అని పేరు. దీనికే మూల ప్రకృతియనియు ప్రధాన

మనియు అవ్యక్త మనియు నామాంతరములు. ఇదే మహద్యోని. యిదే త్రిగుణగర్భిణి. యిదే మహా మాయ. ఇందు బీజ రూపముగా నున్న త్రిగుణములు అనగా సత్వ రజ స్తమోగుణములుహెచ్చు తగ్గులు లేక సామ్యావస్థయందుండును. యిటనే సృష్టికి హేతుర్భూతమైన ప్రథమ చలనము కల్గును. కనుక సృష్టికి పూర్వ దశ యిదే సృష్టికి పూర్వమున్ను సృష్టికి పరముగా యున్ను ఈప్రకృతి యుంటున్నది. కనుక దీనికి పరాశక్తి యని పేరువచ్చినది. కాని శక్తి యంతయూ ఏకమే. " ఏకం అనేకం భవతి " అనురీతిగా యిదేఅనంతశక్తులుగా పరిణమించినది. అందుకే బ్రహ్మము ఏ మార్పు చెందనిదనియు మార్పు చెందినదానివలె తోచుట మాత్రమే కావున బ్రహ్మావివర్తము చెందినదనియు మాయయే పరిణామము చెందుననియు ( బ్రహ్మవివర్తం - మాయా పరిణామము) అని అద్వైతులందురు.

**శృతి:- బ్రహ్మణోరవ్యక్తాన్, అవ్యక్తాన్ మహత్, మహదో మహదహంకారః, అహంకారః పంచతన్మాత్రాణి, పంచతన్మాత్రేభ్యో పంచమహాభూతాని పంచమహా భూతభ్యోఽఖిలంజగత్"**

కనుక పరబ్రహ్మమందలి అవ్యక్త రూపమగు యీ పరా ప్రకృతి సత్వ రజః తమో గుణ విజృంభణచే మహద్రూపము జెంది వరుసగా ఈశ్వర జీవ జగత్తులా యెను. సత్వగుణోద్రేకమున ఈశ్వరుడు, త్రిమూర్తులు ముక్కోటి దేవతలు కల్గిరి. రజో గుణే ద్రేకమున 84లక్షల జీవోపాదులు తమోగుణ విజృంభణచే పంచభూతాత్మకమగు జగత్తు కల్గెను. ఈ విధంగా పరా ప్రకృతి నీచరూపకమగు అపరాప్రకృతిగా పరిణమించెను. 1. మహత్తు 2. మహదహంకారము 3. పంచతన్మాలు 4. ఆకాశ 5. వాయు 6. అగ్ని 7. జలము 8. పృథ్వి యీ యెన్మిదే అది. ప్రకృతి రూపమగు అపరా ప్రకృతి యందు మహతత్వము లేక సమిష్టి బుద్ధినుండే త్రిమూర్తులుద్భవించిరి. కనుక పరా ప్రకృతి విశ్వజనని కనుకనే త్రిమూర్తుల ఆరాధనకంటెను పరాప్రకృతిని ఉపాసించుట యుత్తమముగా భావింపబడుచున్నది.

యీ నవవిధ ప్రకృతులే నవశక్తులు అనియు యీ నవ శక్తుల ఆరాధనకే నవరాత్ర దీక్ష యనియు లోగడ ఉటంకించితిమి. ఇందలి పరా ప్రకృతి పూజయే పరాపూజ. యీ పరాప్రకృతి పరమాత్మ కంటే భిన్నముగాదు. కనుక యీపరా ప్రకృతియే సచ్చిదానంద రూపిణి స్త్రీ మూర్తిగా పరమాత్మను భావించుటే యగును. యీ భావన చేతనే శ్రీరామకృష్ణ పరమహంస "కాళి" ని సగుణముగా ఇష్ట దేవతా మూర్తిగా నర్చించి తత్వమును గ్రహించెను.

**శ్రీ అరవింద ఘోష్ కూడా ప్రకృత్యోపాసన ప్రధానముగా వివరించెను.**

పరా ప్రకృతి మహామాయ యనియు అపరాప్రకృతి యోగ మాయ యనియు (లేక శు ద్ధమాయ యనియు) జీవ ప్రకృతి అవిధ్యా స్వరూపమనియు వేదాంత శాస్త్రములు పేర్కొనుచున్నవి. యీ శక్తు లన్నియు వస్తుత: నిరుపాధికముగా నున్నను ఉపాధులందు మాత్రమే గోచరించు చున్నవి. అద్వైత వాదమునందు మాయారూపమగు యీ ప్రకృతి అనిర్వచనీయమని సిద్ధాంతము. ఆదిశంకరులు సహితము ఈ మాయను చూచి వివేక చూడామణి యందు "సన్నాప్యసన్నాప్యు భయాత్మికానో, భిన్నాప్య భిన్నాప్యు యకాత్మి కానో, సాంగాన్య సంగాన్యు భయాత్మికానో, మహాద్భుతా2 నిర్వచనీయ రూపా" ( అనగా ఈ మాయ సత్తు, అసత్తు, యుభయాత్మికమునై యున్నది. అట్లే భిన్నము, అభిన్నము, యుభయాత్మికము, సాంగము, అసంగము యుభయాత్మికము నై అనిర్వచనీయమై మహా అద్భుతమై యున్నది) అని అబ్బురపడెను. కనుక యీ నవ విధ శక్తులను లేక ప్రకృతులను ఆరాధించుటకై నవరాత్ర దీక్ష విధించబడినది.

## 3. శక్తి ద్వయము

శక్తియనగా సామర్థ్యము. పురుషుని విడచి పురుషశక్తి ఎట్లు భిన్నము కాదో, అట్లే చైతన్య సామర్థ్య రూపమైన శక్తి చైతన్యముకన్నా భిన్నము కాదు. కనుక చైతన్యమన్నా శక్తి యన్నా నొక్కటే. చైతన్యమే స్వప్రకాశ రూపమైన బ్రహ్మము.

శక్తి బ్రహ్మము కన్నా భిన్నమనుచో అద్వైతహాని. అభిన్నమనిన అది బ్రహ్మ రూపమే. కనుక బ్రహ్మము కన్న భిన్నమై యింకొక శక్తి కలదనరాదు కనుక బ్రహ్మమన్నా చేతనమన్నా శక్తియన్నా పర్యాయ పదములే కాని వస్తువు మాత్రం ఏకమే.

దీని ఉపాధియందు సత్తు అసత్తు, అధిష్ఠానము- అవ్యక్తం, పురుషుడు-ప్రకృతి, చిత్తు- జడము, క్షేత్రము-క్షేత్రజ్ఞుడుగా తెలియు చున్నందున శక్తి ద్వయమని చెప్పబడును.

శుద్ధ సత్వ ప్రధానము(మాయ) పరా-ప్రకృతి-యనియు, మలినసత్వ ప్రధానము (అవిద్య) అపరా ప్రకృతి యనియు ఈరెండే శక్తి ద్వయమనియు, పురుషుడు అధిష్ఠానమనియు, శక్తి ద్వయాతీతుడనియు అద్వైతనిర్ణయము.

అపరాప్రకృతి స్థూలరూపముగాదు. సూక్ష్మశరీరము (లేక వ్యష్టి ప్రాణము) మాత్రమే. అపరా ప్రకృతి సప్తధాతు మయమగు స్థూలదేహము కాదు. పరాప్రకృతి సమిష్టి ప్రాణము. సమిష్టి వ్యష్టి రూపమగు ప్రాణమే ప్రకృతి ద్వయము. అనగా పరాపరాప్రకృతులు లేక శక్తిద్వయము. ప్రాణము త్రిగుణాత్మికం గనుక యిదే ప్రకృతి. వీనికి అధిష్టాన రూపమగుప్రత్యగాత్మ పరమాత్మలే పురుషద్వయము. సమిష్టిప్రాణమే పరా చైతన్య రూపంగా యుంటున్నది. ఇదియే వ్యాపకరూపమును, ఆవరణ రూపమును అయివున్నది. ఈ పరాప్రకృతి (అవ్యక్తము, ప్రధానము లేక మహామాయ) పురుషుని కంటే భిన్నముకాదు. దీని రహితమునకే ద్వాదశి నిర్ణయము. కాలచక్ర కర్మచక్రములు రెండును దీనియందే యున్నవి.

## 4. వార్తికలక్షణము

అరవైనాలుగు విద్యలకు అంతమైయుండునది వేదాంతము. అట్టి వేదాంతమున కంతమై యుండునది వార్తిక లక్షణము. ఆ వార్తికము యెట్టిదనిన కేవల గురు సాంప్రదాయ రహస్యమై నిర్వాసన మౌనస్వరూపమై యుండునది.

వేదాంత మధ్యారోపాప వాదమని తెలియును గదా. ఆ వార్తిక నిధిద్యాస మేలాగనిన బ్రహ్మమందు ప్రపంచము కల్పించి తిరుగా లేదనుట గదా। అధ్యారోపాప వాదము.

బ్రహ్మమనగా స్వయంప్రకాశ స్వరూపము.ప్రపంచము తమోమయముగాన నట్లు కల్పించుట సూర్యునియందు చీకటి కల్పించి తిరుగా లేదనకూడునా? కాబట్టి అధ్యారోపాపవాదములు చేయకూడదు. నిధిధ్యాసయే అనుభవవముగా చెప్పబడును. మలము పూసుకొని కడిగి వేయుటకన్న నది ముట్టకుండుట బాగున్నట్లు బ్రహ్మమందు ప్రపంచమారోపించి లేదనుట కంటే కల్పింపనూరకుండుట మంచిదని వార్తిక న్యాయము.మమమమమ

మరిన్ని వేదాంతము. ప్రపంచము రజ్జుసర్పభ్రమ వంటిదిగదా సాధించెను. వార్తికంబది సమ్మతింపదు. అదెట్లనిన దృష్టాంతమందు రజ్జువు బ్రహ్మమాయెను. సర్పము ప్రపంచమాయెను. ఈ పట్ల రజ్జ సర్పభ్రమల రెంటిని నెరిగెడివాడెవడు? అతడెటువంటివాడు? అతడెక్కడనుండును? బ్రహ్మమనియును ప్రపంచమనియును తెలియుటకు నెవ్వరుగలరు? ఆదృష్టాంత మందట్లన వచ్చునా? అనెనా కానిమ్ము. రజ్జుసర్పభ్రమములనుసమ్మతించెదము. రజ్జువు నెరిగి భ్రమసెనా? యెరుగక భ్రమసెనా? యెరిగితే భ్రమయేలేదు. యెరుగక యుండెనా? సర్పమని యుండ వలెగాని భ్రమయని చెప్పకూడదు. కాబట్టి యెరిగినను భ్రమలేదు. యెరుగకున్నను భ్రమలేదు. ఇంతియేకాదు ఇంకొక్క రహస్యంబున్నది. అదెట్లనిన రజ్జువు తనయందు తాను సర్పముగా భ్రమసెనా? అన్యులు భ్రమసిరో యనిన అన్యులు భ్రమసిరనిగదా చెప్పవలెను.

వేదాంతము బ్రహ్మము తనయందు తాను భ్రమసెనని చెప్పుచున్నది. రజ్జువు తాను సర్పమని భ్రమసెననగూడదు. బ్రహ్మము తానే భ్రమసెనను దృష్టాంతము పట్టనేకూడదు. ఈవరకు చెప్పినది యేమాయెననిన భ్రమయను శబ్దమేలేదన్నట్లాయెను.

వార్తికము నిష్కర్మ చమత్కారమును క్రమముగా జెప్పుచున్నారము. నిత్య నిరంతర నిష్ప్రపంచాద్వయ మార్తాండాఖండైక రస బ్రహ్మంబునందు, కాలత్రయమందును, కాల త్రయము తోడ మాయా ప్రపంచమును చీకట్లు కలుగజేయ కూడదు. కలుగజేసి అదిలేనట్లు శ్రవణాదులు కూడదు అమనస్కంబైన బ్రహ్మమును మననము జేసి యెరుగుటెట్లు? తానైన బ్రహ్మను నిధిధ్యాసుంచుటెట్లు? నిరంతర సమాధి సహజమై యుండగా ఒకప్పుడు సమాధినుండి అనుభవించుట యెట్లు? అజ్ఞానముతో గూడా తత్కార్య జీవేశ్వరాది ప్రపంచంబు మిధ్యయనియు ఆగామి సంచితములు మాత్రము పోయినవనియు. ప్రారబ్ధము దేహావసాన పర్యంతము యుండునని చెప్పితే సహించుటెట్లు?

లేని ఆకాశపుష్ప ములేదనియును. లేని వంధ్యకు పుత్రుడు లేడనియును, తెలియునట్లుగా శ్రవణ మనన ధిధ్యాసలుజేయవలయును. అనగా సర్వాత్మనా ప్రపంచము పుట్టనేలేదని వార్తికాభిప్రాయము.

## 5. మృత్యురహస్యం

1. "జాతస్య మరణం ధృవం" × "మృత్యోర్మా మృతంగమయ"
2. శరీర నిర్మాణంలోనే నిర్మూల బీజములున్నాయి.
3. బహుశ శరీరం యొక్క నిత్య పరిణామంలో వెలువడే వ్యర్ధ పదార్ధాలు విషములు కావటం చేతనే మరణం కలుగుతుందేమో?
4. "జీవమెన్నడు నాశమొందదు".
5. పేరమీషియం, అనేది మురికినీళ్ళలో బ్రతికే ఒక ఏకకణ జీవి. యిది అజరామరము. మృత్యువులేదు. రెండేసి రెండేసి కణాలుగా ఎప్పటికప్పుడు విభాగమైపోతూ అనంతంగా జీవిస్తుంది. 13½ సంవత్సరంలో ఇది 9000తరాలు జన్మ ఎత్తినట్లు ఒకడు కనుగొన్నాడు.

8. వైజ్ఞానిక పరిశోధనవల్ల ( చచ్చిన మనిషిలో కణాలు) అనేకరోజులవరకు సజీవంగా ఉన్నట్లు కనబడింది.

9. మానవశరరీరం లో ఉష్ణోగ్రతను 49.50 ఫారన్ హీటు కు తగ్గిస్తే మనిషి 1900సం॥ లు బ్రతుకుతాడు అని లీబ్ అనే శాస్త్రజ్ఞుని అభిప్రాయం కానీ నార్మల్ 98.40 దేశమైనా. 115సం॥ ల ఆయుర్దాయం ను పెంచవచ్చు. ( కానీ భౌతిక మానసిక బాధలు తగులకుండా చేస్తే ) 10 ఏళ్ళ కుర్ర వాని యందే సహనశక్తి రోగ నిరోధక శక్తి , పునరుజ్జీవశక్తి..... ద్వారా అంతశక్తినే జీవితకాలమంతా ఉండేటట్టు చేస్తే ఆయుస్సు 800 సం॥ లకు పెంచవచ్చు. 22000 వరకు పెంచవచ్చని కొందరు కొలంబియా విశ్వవిద్యాలయం ఆచార్యుడు డాక్టరు హెన్రీసిమ్సు అభిప్రాయపడుతున్నారు. చావుతప్పదన్నది అసత్యం చెయ్యాలి. అని జీవరసాయనిక విజ్ఞానవేత్తలు కృషి చేస్తున్నారు. జీవలక్షణాలను పూర్తిగా అవగాహనచేసుకొని జీవకణాల నిర్మాణరహస్యాన్ని పునరుజ్జీవక విధానాన్ని తెలిసి మృత్యుంజయము కావాలని వీరికృషి.

సాందీప కుమారున్ని శ్రీకృష్ణుడు తెచ్చాడు. ధర్మరక్షణార్థం బ్రాహ్మణకుమారున్ని బ్రతికించాడు శ్రీరామచంద్రుడు.

జీవకణాలు బహిర్గతం అవటం వాటిస్థానే క్రొత్తవి రావటం నశించిన జీవకణాలకు శరీరంలో స్థానం ఉండదు. బయటకి నెట్టబడుతాయి. *Like water in a fountain.*

జీవశక్తి = ప్రోటోప్లాజం యిదిమనం తిన్న ఆహారంనుంచి జీవకణాలను సృష్టిస్తోంది. జీవశక్తి తనలో ఒక భాగాన్ని విచ్చేదిస్తే ద్రవ్య వినాశనం జెంది శక్తి గామారుతుంది. ఇదే పాక్షిక మృత్యువు. *(para.. death)* నశించిన వానిస్థానే కొత్తవి రాకపోవడం అనగా ఆ సృజనశక్తి నశించడమే మరణం. పాము కూసం విడిస్తే లోపల మరోచర్మం తయారైంది. కాని పాత చర్మం మృతిపొందింది.

బిడ్డను కంటే ఒకజీవకణం మృత్యువు నుండి తప్పించుకొన్నట్టే గదా. తండ్రి లేక తల్లి తరానికి మరో తరానికి ఈవిధంగా జీవ(ద్రవ్య)శక్తి సంతత ప్రవాహంగా. సతతం సాగుతోంది. కాని శవంలో నిలిచిన జీవకణాలు శరీర శిధిలాలనుంచి క్రొత్తరూపంలో సృష్టి పొందుతాయి. ఇదే రిడక్షన్ = ఒకరూపాన్ని మరోరూపానికి మార్చటం. పూర్వపు జీవికి క్రొత్తజీవికి చాలాభేదం.

## 6. సనత్సుజాతీయం

**శ్లో॥ శరీరమేతాకురుత: పితామాతాచ భారత**
**ఆచార్యవస్తు యజ్జన్మ తత్సత్యం వై తధామృతం॥**

తల్లి దండ్రులు శరీరమును మాత్రము కలుగజేసిరి . గురువు క్రొత్తజన్మము (బ్రహ్మజ్ఞానము వలన) కలుగ జేయు చున్నాడు. ఆ జన్మ మమృతం.

**యధానిత్యం గురౌవృత్తి ర్గురు పత్న్యాం తధాచరేత్,**
**తత్పుత్రేచ తథా కుర్వన్ ద్వితీయ: పాద్మచ్యతే ॥**

( గురు ద్వారా పుత్రుల యందును అట్టి భక్తి చూపవలె )

పూర్ణాత్పూర్ణ ముద్ధరన్తి పూర్ణాత్పూర్ణం ప్రచక్షితే, హరన్తి పూర్ణాత్పూర్ణంచ పూర్ణేనైవావశష్యతే. యోగినస్తంప్రపశ్యంతి భగవంతం సనాతనం॥

శంకరులు

1. **నిత్యశుద్ధం బుద్ధముక్త భావమీశమాత్మనా।**
**భాఖీవయన్ షడింద్రియాణి సంనియమ్య నిశ్చల:॥**

2. **అస్థిరస్తు చిద్ఘనం జగత్ప్రమాది కారణం।**
**ససశ్వకం తదుద్భవం జగత్తమో మదంచ యత్ ॥**

3. **తత్పదైక వాచకం సదా? మృతం నిరంజనం ।**
**చిత్తవృత్తి దృక్సుఖం తదస్మ్యహం తదస్మ్యహం॥** *భ.గీ॥ 8-24 ---27*

దు:ఖమనగా సుఖాభావనగాదు. దు:ఖమనగా అల్పసుఖములు అశాశ్వత సుఖములు. మొదట సుఖముగా నుండి పిదప దు:ఖపర్యవసానముగలవి. వచ్చిపోయే సుఖములు దు:ఖప్రదములే. ఏలననగా భార్యా పుత్ర ధనాదులు లేనిచో ఒకటే బాధ. వచ్చి పోతే మరీబాధ గదా । నిజమైన సుఖమే ఐతే మరల దు:ఖము కలుగ కూడదు. స్వర్గ సుఖమున్నూ అంతము గలదియే అగుటచే అదికూడ నిజమైన సుఖము కాదు.

కర్మ ఉన్న చోట కష్టము తప్పదు. కర్తవ్య రహితమే అమృతము. నేను దేహమునను కొన్నంతవరకు కర్మ మాననేల? దేవుడననుకొంటేనే కర్తవ్య రహితం.

ప్రియ మనేది "అప్రియమే" అంతేగాని సుఖం ప్రియం దు:ఖమప్రియం కాదు. ఏలననగా దేశకాలాదులను బట్టి ఒకే వస్తువు సుఖ దు:ఖములు కల్గించును. నియతమైన సుఖము బ్రహ్మలోనే వున్నది. సర్వ కామావాప్తి అనేది ఆత్మా నందములోనే లభించును. పరిచ్ఛిన్నుడికి సుఖం లేదు. సుఖమున్నట్లు తోచినా ఆభాస మాత్రమే.

దు:ఖము రెండు విధములు - 1. శరీర దు:ఖము 2. మానసిక దు:ఖము.

**1. శరీర దు:ఖము:-** గజ్జి వాత పిత్త శ్లేష్మాదుల వలన వచ్చు ఆధ్యాత్మిక తాపము.

**2. మానసిక దు:ఖము:-** ఆంతరంగిక బాధ. వాంఛా సముద్భవం వాంఛ తృష్ణయే దు:ఖకారణం.

మిగతా జీవరాశికి ఋతుకాలమునకే మైధునానందం. మానవునకు తృష్ణవుండి దు:ఖమగును. "తృష్ణాఏకాతరుణాయతే" బర్తృహరి. వృద్ధాప్యంలో మరీ వాంఛ. వ్యాసకీటకోపాఖ్యానం. (భారతం) బండి వస్తూ వుంటే కీటకం పక్కకు తప్పుకొంది. కీటకములకున్న సుఖము మానవులకు లేనేలేదని వాదించినది. వానికి మైధునంలో యితరులు చూస్తారని భయం లేదు. రాధ ఎంతో భయపడేది.

ఆత్మ వస్తువును తెలిసికొని భక్తితో చేసిన భజనలే నిజమైన భజన. తనకంటే భిన్నవస్తువును భజించునంతవరకు అది భజన కాదు. సద్గురువులనిన ఆ ప్రకారము వస్తు నిష్ఠ చేయవలెను. ఆత్మ దేవతారాధనమే ఆరాధన. అన్నం బ్రహ్మ అహం బ్రహ్మ భోక్తాచ బ్రహ్మ అపుడే బ్రహ్మ యజ్ఞము.

**"బ్రహ్మార్పణం, బ్రహ్మ హవి: బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతం**
**బ్రహ్మైవతేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" ॥**
**ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానంవా గుణాన్వితం ।**
**విమూఢా నాను పశ్యంతి పశ్యంతి జ్ఞాన చక్షుష: ॥**

సంకల్పాలు గోత్ర నామాలు చెప్పటం దేనికి? ఈ ఘటం ఎక్కడేస్తేనేం? దేశ కాలాలతో నిమిత్తమేమి? బ్రహ్మకర్మ సమారభేత్ అని ఊరికే అంటే చాలదు. అన్ని క్రియలలో బ్రహ్మ దర్శనం చేస్తుంటేనే అది బ్రహ్మ కర్మ. లేకుంటే అది భ్రమకర్మే. నీ శరీరానికి నీవు సేవ చేసుకుంటున్నావే। గురు శరీరానికి చేస్తే ఏమి తప్పు.

నేను:- జగత్తు కనిపిస్తూంది లేదంటారేం? అంటే శంకరులు దేనిచేత కనిపిస్తుందో చూడమన్నారు. చిన్మాత్రమే వస్తువు గావుంటే దేహ భ్రాంతి యెందుకు? ఇదం ప్రత్యయంలో శరీరం అహం ప్రత్యయంలో నేను భాసిస్తున్నవి. యుక్తికి ఆత్మ వున్నదని తేల్తోంది. అజ్ఞానం జ్ఞానందేనిచేత తెల్వబడు తోందో అదే ఆత్మ. అదే అసలు నేను. అజ్ఞానంచేతనే అనృత జడ దు:ఖములు కనిపించి సచ్చితానందములు ప్రపంచములో కనబడుట లేదు. రజ్జు సర్ప దృష్టాంతములోని రజ్జువే నీవు. అస్తి శబ్దార్థ బ్రహ్మైతే వున్నట్టు ఇది కూడా బ్రహ్మే. మాయ బ్రహ్మ కంటే వేరుకాదు. ' వెధవ వేదాంతాలు ' అని వేదాంతాన్ని బ్రాహ్మలే వెక్కిరిస్తుంటారు.

శారదాదేవిని నగ్నంగా చూస్తే రామకృష్ణునికి సమాధి గల్గిందట. విషయములంటే డోకు రాకూడదు. అవికూడా బ్రహ్మమే అనేదృష్టి రావాలి. వేదాంత సార్థకం కావటానికి వాని యందు పూజ్య భావమే రావాలి. చిద్దర్పణానికి బింబాపేక్ష లేదు. అద్దంలో పండు తినలేము కాని చిద్దర్పణంలో పండు తినవచ్చును.

ఉన్నదంతా పరమాత్మయే అని తెలిస్తే నీవు పరమాత్మయే అగుదువు.

మనస్సు లాగుతూనే వున్నది వస్తుభోగములోని దు:ఖము గోచరిస్తూనేవున్నా మనస్సు లాగుచునే యున్నది.

కేవలం శరీరానికి లేదు. కేవల ఆత్మకు లేదు. బాధ అంతా మధ్యనున్న ఆత్మకే. (మనస్సునకే) ఆత్మనిష్ఠతోగాని కామ శాంతి( కోరికలు పోవు)కాదు.

దుష్టుల చెలిమి సనిమిత్తం శిష్టుల చెలిమి నిర్నిమిత్తం.

**తాదాత్మ్యములు:-**

1. శరీర తాదాత్మ్యము = నేను బలిసినాను
2. యింద్రియ తాదాత్మ్యము = నేను కుంటిని, గ్రుడ్డిని
3. మనోతాదాత్మ్యము = యిలా చేసినాను అలా చేసినాను అనుట.
4. బుద్ధి తాదాత్మ్యము = యీప్రకారం నిశ్చయించినాననుట.
5. ప్రాణ తాదాత్మ్యము = ఆకలి దప్పులు

అణోరణీయాన్ =. ఆత్మ అణువుకన్నా చిన్న దనుటలో పరమాణువులోనున్నదే అని అర్థం.

శుద్ధచైతన్యమునకు బుద్ధి తాదాత్మ్యం వలన జీవత్వము వచ్చినది. బ్రహ్మాకారత యెక్కువైనకొలది విషయ వైరాగ్యము కలుగును.

**నిధిధ్యాస**మనగా ధ్యానము యొక్క ఏకాగ్రత దీనివల్లనే అపరోక్షమగును.

**జ్ఞానము**నకు సంసారమున్నా లేకున్నా బాధలేదు. సంతోషము లేదు.

జ్ఞానస్వరూపునికి అజ్ఞాన మేమిటి? ప్రేమస్వరూపునికి ద్వేషమేమిటి? ఆక్షేపకునికి ఎంత చెప్పినా బోధపట్టదు. జిజ్ఞాసువునకే అర్ధమగును.

శ్రద్ధావాన్ లభ్యతే జ్ఞానం, విశ్వాసో ముక్తి కారణం

నిద్రలో యెంత హాయి అనుభవిస్తున్నావు? అప్పుడు విషయములు లేవుగా!

అపుడు యేవస్తువు హాయినిస్తోందో తెలుసుకో!

నాశరీరం కూడా బ్రహ్మమే నని చెప్పేది బ్రహ్మవిద్య. మనుష్య మాయకంటే దేవమాయ అంతకంటే అసురమాయ, అంతకంటే శ్రీకృష్ణుని మాయ (విష్ణుమాయ)గొప్పది. బ్రహ్మమాయను మాయం చేసినవాడు కృష్ణుడు.

కర్త అనగా చైతన్యమే. కుమ్మరిలోని చైతన్యమే కుండ చేసేది కుమ్మరి కాని దేహముకాదు. చార్వాకులు చావే మోక్షమంటారు. యత్కించిన్నాశం మోక్షమా? యావన్నాశం మోక్షమా? చావే మోక్షం అయితే చంపితే వూరుకొంటాడా?

భగవంతుడే సర్వస్వమని గోపికలవలె అనుకో.

**"యద్ జీవితంతు నిఖిలం సర్వ భావేన భాగవతః"**

యిదే మహాభావము శుద్ధ ప్రేమతో నీకు దోషము కూడా గుణముగానే కనబడును. పరమేశ్వరుడే పూర్ణదాత.

ఆహర నిద్రా మైధునములు గూడా ఆత్మధర్మములని తెలుసుకో.

నిన్నే భగవంతునికన్నా వేరుగా చూడవద్దు అనిశాస్త్రం చెపుతుంటే దేవతా మూర్తులను వేరుగా చూడవచ్చునా?

నేను శరీర ధారిని గాదు. ఇది ప్రపంచం కాదు. బ్రహ్మే అని స్థిరభావన సతతం చేయుటే దీక్ష. నిన్ను వేరుగా పెట్టుకొని చూపించే వస్తువు లేదు.

శాస్త్ర మనే కన్ను నీకు వున్నా సూర్యుడనే గురువుంటేనే కాని ఏమీ కనపడదు.

భగవత్కృషిలో ప్రత్యవాయంలేదు. ఎంత చేస్తే అంతే ఫలం.

'నీ ప్రేమకు సంతోషించును గాని నీవిచ్చిన వస్తువులకు సంతోషించదు భగవంతుడు.(పత్రం పుష్పం - ఫలం తోయం )

ద్రౌపతి గజేంద్రుడు శబరి రంతిదేవుడు యిచ్చినవి.

"యద్దృశ్యం తత్కార్యం" = ఆకాశము దృశ్యము కనుక అదీ కార్య రూపమే.

'స్వభావం కారణమంటే - స్వభావం జడమా చేతనమా?

చైతన్యమనేది పండుకు రసము, పువ్వుకు వాసన వచ్చినట్లు రాలేదు.

'అహం బ్రహ్మాస్మియే శరణాగతి'

'భక్తి అనగా భగవంతుడే ప్రేమనేది ఆత్మైకత్వం లోనేవుంది'

'భగవంతుని కభిముఖుడైన వానిదగ్గర ప్రారబ్ధంగాని నియతి గాని పని చెయ్యవు. ప్రారబ్ధం తప్పదను కొనుట మన ప్రారబ్ధమే. ప్రారబ్ధాన్ని తప్పించలేనిచో అవిద్య నెలా తప్పిస్తాడు? జ్ఞాని ప్రారబ్ధాన్ని సంతోషంగా అనుభవిస్తాడు.

అసలైనక్షేమమును తెలుసుకొన్న జ్ఞానిని క్షేమమా అని అడుగుట కూడా అపరాధమే.

పరమాణువులు కూడా చైతన్యం కాకపోతే ఎలా కలుస్తాయి? కలిపే కర్త యింకొకడు కావలె.

త్రిపుర = తల్లి (శుద్ధచైతన్యము)　　బుద్ధి చెలికత్తె - దానికి అవిద్య చెలికత్తె

జీవచైతన్యము

తాదాత్మ్యంకు మోహుడు

పెండ్లాడినది　　బుద్ధికుమారుడు = మనస్సు = ఆస్తికుడు

వీని భార్యలు

చపల




శరీరమనేయింట్లో కాపురం

యిదే బ్రహ్మ పట్టణం = నవద్వారాపురం

ఆత్మజ్ఞానము = మంత్రశక్తి

ప్రభాకరుడు =ప్రాణము - అడవులని చెప్పినవి

నవకములు

బుద్ధిలో విషయవాసన లేనాడు పోతాయో ఆనాడు ఆత్మసాక్షాత్కారము

ఆత్మ నిష్టకు ఏకాంతంగాని అధ్యాయిగాని యిద్దరుండవలెను. ( పరిహృత పరిహార్యం ప్రాప్తప్రాప్తవ్యం)

బాహ్యానిరోధం చేత ఆత్మప్రాప్తమైతే ఆ నిరోధం సాధనే అవుతుంది

అప్రాప్తప్రాప్తి = ఉదా॥ ఘటం అక్కడే వున్నా చీకట్లో కనుపించక ప్రకాశంలో కనుపించినది. వేరొక ప్రకాశం వల్ల యీ ప్రకారం తెల్పబడుటలేదు. కనుక స్వయం ప్రకాశమే అది అనవలె.

నేను అనేది ఆత్మేగాకుంటే సాధనకు నీవుంటేగదా సాధన. సాధనకు ముందే సాధనచేసే నీవున్నావుగా.

నిన్నావరించిన అజ్ఞానాంధకారమును తొలగిస్తే ఆత్మదర్శనమగును రజ్జుసర్పమే అప్రాప్తప్రాప్తి. ఎప్పుడూ లేని పాము త్రాటియందు తోచటం దీనికి ప్రాప్త ప్రాప్తియే పరిహారం.

నిదిధ్యాస = విజాతీయ ప్రత్యము లేని సజాతీయ ప్రవాహం. శేషభావంచేత నిధి ధ్యాసచేయవలె. నేతి నేతి వాక్యముల్తో " ప్రమాణానాం ప్రమాణ తత్ " అది ప్రమాణానికే ప్రమాణం కాని దానిని అప్రమాణం అని యెందుకన్నారు? అంటే దానిని తెలుసు కొనే వేరే ప్రమాణం లేదన్నమాట. అది నిత్యసిద్ధ వస్తువు గనుక దానిని పొందుటకు ఏ ప్రమాణమూ లేదు. ప్రమాణాపేక్ష లేదు.

మనస్సునే నిరోధించాలి గాని యింద్రియములను నిరోధిస్తే తూములు బిగిస్తే నీరు పొంగి పోయినట్లు మరీ బాధించును.

''అస్తి నాస్తి వికల్పాలు చేతనం వుంటేనే కనుక చేతనంతో అస్తి అంటే అది పరిపూర్ణమెట్లవుతుంది. నువ్వే లేకపోతే అస్తి నాస్తి అనేవారెవ్వరు?

## జ్ఞానం కన్న జ్ఞేయం భిన్నం కాదంటారు

**ప్ర:-** అద్దము లేనిచో బింబమనే మాటే లేదు. అట్లే జ్ఞానగర్భంలోనే జ్ఞేయమున్నది. దేశకాలాదులు జ్ఞానంలో యెలా పట్టుతయి?

**ఉ:-** దేశకాలాదులు పరిచ్ఛిన్నములు అవిగూడా జ్ఞానగర్భంలోనివే. అన్ని చిత్ప్రకాశంలోనివే జ్ఞానమే ఘటాకారంగా భాసిస్తున్నది.

**ప్ర:-** దీప ప్రకాశం వేరు ఘటం వేరుగా ఉన్నట్లు జ్ఞానం వేరు జ్ఞేయం వేరుగా ఉండరాదా?

**ఉ:-** తల్లి గర్భంలో శిశువు వలె లేదు జ్ఞానం. జ్ఞేయ మనేది పరిచ్ఛిన్నంకాదు. బ్రహ్మకన్న భిన్నంగా లేదు.

ఆకాశకార్యం ఘటమనుకొంటే ఘటము కూడా మహాకాశమే కనుక జ్ఞానమే నేనని అనుసంధానం చేయాలి.

దృశ్యాకారాలు నిరసిస్తూంటే మనజీవితం తెల్లారుతుంది. కనుక చూచేదంతా బ్రహ్మమేననే భావనే గొప్పది. సూక్ష్మదృష్టికే జగత్తంతా బ్రహ్మంగా కనిపిస్తున్నది.

స్వప్నంలో మనస్సు చైతన్యమే వుంటాయి. గ్రంధి భేదనం కావాలి. అంతేగాని కనుమూస్తే విషయాలు లేకుండా పోతాయే గాని అంతమాత్రం సరిపోదు.

ఆత్మానాత్మలని రెండూలేవు. అంతా బ్రహ్మమేననే దృష్టి కావాలి. అపుడే అద్వైతసిద్ధి. సర్పంగా కనుపించినా త్రాడే జగత్తుగా దోచినా బ్రహ్మే క్షేత్రం గూడా క్షేత్రజ్ఞడే.

విరక్తి శాస్త్రం మందాధికారులకే యిల్లే బ్రహ్మ యిల్లాలే బ్రహ్మ అనే దృష్టిపోవడం కొరకే వైరాగ్యం.

నిద్రలో దు:ఖం లేని సుఖం కనబడుటలేదు. వస్తువు తెలుసు కొని చేస్తే చాకలి, మంగలి, పాకీ పనులు గూడా బ్రహ్మకర్మే అగును.

ఆత్మ వస్తువు కన్ను తెరిస్తే పొయ్యేదికాదు. దేశకాలములున్నంతవరకు పూర్ణ సమాధికాదు. పామున్న చోటనే త్రాటిని, దేహమున్న చోటనే ఆత్మను జగత్తున్న చోటనే బ్రహ్మను చూడాలి.

విజ్ఞుడు అద్దానికన్న భిన్నంగా ప్రతిబింబం లేదని తెలుసుకొంటాడు.

కన్ను మూయడం అనేది నీకు వుండాలంటే నీవు స్వతంత్రుడవెట్లౌతావు? ఆముడి కూడా పోవలసిందే. దృక్ దృశ్యములు రెండూ నీకే.

సహజముగానున్న ఆనందమే నీకు విషయవాసనలవలన గోచరించుటలేదు నిద్రలో సుఖమున్నదని కుంభకర్ణుడికి యే ఆనందమో అదే నీకున్నూ.

జ్ఞానం కల్గినదికదా అని కోరికలు చంపుకోనక్కరలేదు. కోరికలు నిరోధింపబడవలెను.

పానీయంబులు త్రావుచున్ కుడుచుచున్ అను రీతిగా బ్రహ్మ దృష్టి పోకుండా సదాబ్రహ్మచారి సదోపవాసి వలే వుండాలి. వారి కన్యమైంది వుంటే గదా అంటడానికి మానడానికి? దృష్టి ఎప్పుడు బ్రహ్మమయమో అప్పుడు సృష్టి అంతా బ్రహ్మమయమే.

ప్రపంచం ప్రతిక్షణమూ మారుతూ వున్నది. కనుక ప్రపంచం పుట్టినదని క్షణికవాదులంటారు. ప్రత్యక్షమే ప్రమాణమంటారు.

ప్రపంచం బుద్ధిమయ కోశమని బౌద్ధులు. బుద్ధివృత్తి కంటే వేరేయేమీ లేదు. అంతా బ్రహ్మమే శంకరాద్వైతము.

కార్యకారణాలలో కార్యం లేకుండా కారణం వున్నపుడు కారణం లేకుండా కార్యమెందు కుండకూడదు? అంటారు స్వభావవాదులు. ( చార్వాకులు) అంతా ప్రకృతి స్వభావమే అంటారు. కుండ వుండకున్నా మట్టి వున్నది. మట్టితోనే కుండ అవుతుంది కాని నూలుతో అవదే? కారణం కనబడకపోతే లేనట్లేనా? నీ తండ్రి కనబడకపోతే నీ తండ్రివల్ల నీవు పుట్టనట్లేనా?

దు:ఖముతో కూడిన సుఖమే అత్యంతదు:ఖము కారణం లేని కార్యం. దారిలో ఎవరో వచ్చి అకారణంగా చావగొట్టి నారనుట దృష్టాంతం. అకస్మాత్తుగా పాప పుణ్యఫలములు వస్తున్నవి. సుఖదు:ఖాలకు కారణం లేదన వచ్చునా?

ఆరు పరమాణువులు కలసి త్రసరేణువు = త్ర్యణుకం అగును. సూర్య కిరణ ంలోనినలుసులో ఆరవ వంతు పరమాణువు.

అభావములో నాలుగోది వప్పుకొన్నంతవరకు బ్రహ్మ దర్శనం కాదు. ఒకప్పుడున్న పదార్థం లేదు అనకు. వుంటే ఎప్పుడూ వుండాలి. లేదా ఎప్పుడూ లేదు అను. అయితే మాయ ఒకప్పుడుండి ఒకప్పుడు లేదు కనుక ఎప్పుడూలేదు. వున్నదంతా బ్రహ్మమే. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సత:" ఈశ్వరేచ్ఛచేత ప్రపంచమైనదంటే ఒక మనిషి సంకల్పిస్తే కుండ తయారగునా?

ఒకదానిచేత తెలుసుకొనేది ప్రత్యక్షము కాదు. జగత్తు నిష్కారణం అంటే చార్వాకం ప్రకృతి కారణం అంటే సాంఖ్యం. నాబుద్ధికట్లు తోచిందంటే బౌద్ధం.

సగుణ బ్రహ్మకు సర్వ శక్తులు కలవు కాని నిర్గుణ బ్రహ్మకు లేవు అని ఒక వాదం. వున్నదొకటే అయితే యీ సగుణ నిర్గుణ బ్రహ్మమేమిటి?

అజ్ఞాని ప్రపంచమే విజ్ఞాని బ్రహ్మ

చిత్ప్రకాశం లేనిది. నీకు దేశం లేదు. కాలం లేదు. నీవే లేవు.

స్వప్నంలో ఏ ప్రకాశంతో చూస్తున్నావో ఆ ప్రకాశమే దృక్కు నీవే దేవుడవని బోధిస్తుంటే ఆ దేవుడు కనపడలేదని ఏడవనేమి? పిల్లవాడు కనబడకపోతేనే ఏడుస్తావే? రాస క్రీడ అనగా తానే,తానే అయిన గోపికలతో విహరించాడన్నమాట. దృక్కువేరు దృశ్యం వేరు కాదు.

ఈశ్వరుడు గాని ప్రదేశముంటే గదా మరొక దానిని తన కన్యంగాసృష్టించటానికి? మనో రాజ్యంలోని సృష్టి మనస్సుకన్న భిన్నం కానట్లే విచారిస్తే దేశకాలాదులు కూడా భగవంతుడే **'విష్టభ్యాహ మిదంకృత్స్నం ఏకాంశేన స్థితో జగత్'** గీ. 10.42 దేశకాలాదుల కన్న బ్రహ్మపెద్దది

జగత్తు అంతా బ్రహ్మమైతే నామరూపాలు మాత్రం ఎందుకు జగత్తు కాదు? జగత్తుయందు చైతన్యం లేనిదే జగత్తు భాసించునా?

ప్రతిబింబం స్ఫుటంగావుండాలంటే కఠినత్వ నిర్మలత్వాలు రెండూవుండవలె. మలిన వస్తువు నందూ ప్రతిబింబము లేదు కఠినత్వము లేని నిర్మలమైన నీటిలోను ప్రతిబింబము సరిగా వుండదు.

'సుషుప్తిలో నాకేమీ తెలియలేదు ' అన్నదేది? మన మనస్సు దానిని గుర్తించినదే సత్యవస్తువు.

అస్తి అనీ, నాస్తి అనీ అన్నదినీవే. నీవే లేనిదానికి అస్తిలేదు నాస్తీలేదు.

సావయవమైనదానిలో నిరవయముండవచ్చును, గాని నిరయవమైన దానిలో సావయవ ముండదు. ఆకాశమన్నా బ్రహ్మ మన్నా ఒకటే. అదియే చిదాకాశం. భగవంతుని యొక్క స్వాతంత్ర శక్తి స్థూలరూపమును దాల్చినప్పుడు సంకల్పమనెదరు.

మాయయనగా భగవంతుని యొక్క స్వభావ ప్రభావముఅని తెలియవలెనుగాని అభావమనరాదు.

భగవంతుని అంగములు ఆయుధములు భార్యాపుత్రులు మొత్తం అంతా భగవంతుడే.

విషయవిరక్తి గల్గి ఆత్మప్రేమ యేర్పడుటకై వైరాగ్యం కావలెనన్నారు ప్రధమంలో ఆత్మరుచిమరిగినతరువాత అసహ్యించుకొనే వస్తువేలేదు. యిక వస్తువులందు రాగద్వేషములు లేనేలేవు.

వివేకం చక్షురగ్రత: ఉదయర్కుని ప్రభావం ప్రభాకరునికి మాత్రం తెలియదు.

నిధిధ్యాసచే ఆత్మ సాక్షాత్కారము.

దు:ఖోపశమనము = తలిదండ్రుల మూత్ర పురీషముల పుట్టి పోయేవని కానీ శరీరంలో నిత్యం పోయే నీ శరీర భాగములకు ఎందుకు ఏడువవు?

అన్ని భూతాలు పోయినా ఆకాశం మిగులుతుందే! ఆ ఆకాశం మిగిలివుంటే అదే మా అన్నగారి శరీరం అని భావించవేమి?

కలలో ఏడ్చేవానిని చూచి మెలుకువలో వున్నవాడు నవ్వుతాడు. ఆలాగే శ్రీ కృష్ణుడు అర్జునుని చూచి నవ్వినాడు.

శరీరంలో కొంతపోతే చావా? అంతాపోతే చావా?

1. భగవంతునికి భిన్నంగా జగత్తున్నదనుకొనుట

2. స్వప్నం అబద్ధం జాగ్రత్త నిజమనుకొనుట మోహంలో మోహం.

స్వప్నంలో వుండగా స్వప్నంఅనితెలిస్తే ఏబాధాలేదు. జాగ్రతలో వుండగా జాగ్రత అసత్యం అనితెలుసుకో. స్వప్నానికి అధిష్ఠానం జ్ఞానం అనుకొంటే మూఢుడే. జాగ్రతలోని దృశ్య ప్రపంచమున్ను మారుచున్నది. అపరిచ్ఛిన్న అనువృత్తి దృశ్య ప్రపంచానికి సంభవించదు. దృశ్య ప్రపంచం మారుచునే వున్నది. ప్రమాతను బట్టి స్వప్నము అబద్ధము. సాక్షిని బట్టి నిజం. ప్రమాతను బట్టి జగత్తు అబద్ధమే. సాక్షినిబట్టి నిజమే ఉన్నదంతా బ్రహ్మమే ననే నిధిధ్యాస కావలె. జగత్తంతా భావనామాత్ర సారం. ఈ మనస్సు కూడా బ్రహ్మమేనని ఏనాడు భావనచేస్తావో ఆనాడే మనస్సు బాధాకరం కాదు. మనస్సు అర్ధాత్రయకారి గాదు.

నీవు చేసే కర్మబ్రహ్మ కాకుంటే అది బ్రహ్మకర్మకాదు. బ్రహ్మకర్మ సమారభేత్ అని ఊరకే అంటే నిధిధ్యాస కావలె. జగత్తంతా భావనామాత్ర సారం. ఈ మనస్సు కూడా బ్రహ్మమేనని ఏనాడు భావనచేస్తావో ఆనాడే మనస్సు బాధాకరం కాదు. మనస్సు అర్ధాత్రయకారి గాదు.

నీవు చేసే కర్మబ్రహ్మ కాకుంటే అది బ్రహ్మకర్మకాదు. బ్రహ్మకర్మ సమారభేత్ అని ఊరకే అంటే ప్రయోజనమేమి?

అంత:కరణకు వశముగానివాడే గురువు. మనస్సుయే మూలం మూలాజ్ఞానం. దానికి మూలం బ్రహ్మ.

ఈశ్వరుదు దీపకుని గురుభక్తిని మెచ్చి వరమడుగ మంటే ' మాగురువులో లేనిది మీవద్ద ఏ మున్నదని అడగాలి? అన్నాడట.

బ్రహ్మసత్యం జగన్మిధ్యా అంటే అర్ధం ఏమి చెప్పాలంటే జగత్తు జగత్తుగా లేదు బ్రహ్మంగానే వుంది అని అర్ధం చెప్పాలి.

విజాతీయ ప్రత్యయం లేని బ్రహ్మ భావన చేయాలి. శ్రీ కృష్ణుదుమన్ను తినలేదన్నాదు. అది అబద్ధంకాదు. తానేమన్నా తినుట అంతా బ్రహ్మమే కనుక అతడసత్యం మాట్లాడలేదు.

ఉన్నదంతా బ్రహ్మగానే భావనచేస్తే జగత్తు కనపడదు. దగ్ధపట న్యాయం కూడా అగుపడదు.

ఆకాశంలో జగత్తుచేరింది కాని జగత్తులో బ్రహ్మ క్రొత్తగా వచ్చి చేరలేదు.

ప్రపంచము నిజమనుకొంటారని విరక్తిగా చెప్పటమేగాని హేయంగా చూడమని కాదు.

ఆత్మగాని వస్తువే లేదన్నపుడు అవిద్య వేరే వుందని అనరాదు.

క్షేత్రము కూడా నేనేనని గీత – ' × యథా మృణ్మయో కుంభం ×× '

పరిపూర్ణుడవని తెలిసి నపుడు నీకు ఆకాశం కనబడదు. ఆకాశం నీకన్న వేరుగా వున్నదన్నంతవరకు నీవు పరిచ్ఛిన్నుడవే అదభ్ర సౌహార్ద్రమన్నా ఆత్మప్రేమ అన్నా ఒక్కటే.

జడశక్తి, చిచ్ఛక్తి దీని స్వరూపం యోగమాయ పరిచ్ఛేద భావం భాసించడమే ప్రాథమిక సృష్టి. దీనినే మూలా జ్ఞానమంటారు.

దృశ్యప్రపంచం అపరా ప్రకృతి, పరాప్రకృతి చిచ్ఛక్తి. నేను అనిభాసించటమే శక్తి తత్వం. అహం అనేది చైతన్యం. ఇది అనేది జడం. అహం అంశ చిదాత్మ.

1. అనేక మృద్ఘటములవలె మృత్తువలె అన్నింటిలో వున్న చిదంశ బ్రహ్మమే. అదే శివతత్వం. 2. శక్తి తత్వము 3. కనపడే పరిచ్ఛిన్న తత్వమే నేను అనుకోవడం యిదే సదాశివ తత్వము 4. అహం అంశ చిదాత్మ. ఇదం అనేది జడం 5. శుద్ధవిద్యాతత్వము.

పంచ కంచుకములతో కప్పబడునది పురుషుడనబడును కలవిద్య రాగం కాలం నియతి అని ఐదు కంచుకములు.

కల అనగా కించిత్ కర్తవ్యము. నియతి అనగా పరతంత్రము. యితరులకు లోబడి యుండుట.

పంచకంచుకములు, మాయ, పురుషతత్వం ఈ మూడున్ను మిశ్ర తత్వములు. సుషుప్తిలో వాసనా పిండమును ప్రకృతి అనెదరు. జాగ్రత్స్వప్నములలో చిత్తమనెదరు. నిర్విశేష భావంలో ప్రకృతి చిత్తమనేది చిజ్జడముల సంధి అస్తి పరోక్షం. అస్మి అపరోక్షం. అస్తి అనేది అస్మికావలె. విదేహుడనగాదేహతాదాత్మ్యము లేనివాడు. ఆత్మనిష్ట కలవాడని అర్థం.

**వాదజల్ప వితండములు:-** 1. వాదమనగా తనమాట నెగ్గించు కొనుట. 2. జల్ప మనగా పరసిద్ధాంత ఖండన. 3. వితండమనగా తన పక్షాన్ని నిల్పుకోలేదు. ఎదుట దానిని ఖండిచబోవుట.

కహోలుని కొడుకు అష్టావక్రుడు. అతడు వదాణ కుమారుని ఓడించి అహంభావముతో వుండెను.

**గార్గి:-** అష్టావకృనితో 1. ఆత్మ వస్తువు తెల్వబడేది కాదన్నావు. 2. దానిని తెలిస్తే అమృతత్వం అన్నావు. ఎవర్కి తెలియని వస్తువు నీకెట్లా తెలిసింది?

జవాబు = గురు సేవ యున్న వానికి తెలియును. నీవే ఆప్రకాశస్వరూపుడవని తెల్సుకో. నిద్రలో ఏమీ లేదని తెల్సుకొన్నావా లేదా? అట్లు తెలిసిన తెలివే నీవు. అంతదృష్టి లేక యిది సరిగా తెలియదు.

సంకల్ప రాహిత్యము కల్గినపుడే అంతర్దృష్టి. అపుడు చిదాకాశం కనిపిస్తుంది. అన్నివాసనలు నిరోదించి నిర్విమర్శగాఉంటే ఆత్మ దర్శనము.

**జనకుడు :-** ఆత్మ అవేద్యమైతే యిక గురువెందుకు?

ఫాసము = ప్రకాశమాత్ర జ్ఞానము.

భాస్వము = తెలియబడేది భాస్వము

శుద్ధవిద్యా చిదాత్మకమే భావము, ఇదం బుద్ధి వున్నపుడు అహంబుద్ధి వుండదు.

నేను = సవికల్పం 2. నిర్వికల్పం (నిద్రా సమాధులలోని తెలివి)

ప్రతిబంధములు తొలగుటతో పాటు తత్పరత (తదేకత్ర కావలెను) ఆత్మ దర్శనమునకు అన్యపరావృత్తి తొలగించినచాలును.

**'అపి పుష్ప దశనాత్ అపినేత్ర నిమీలినాత్'** వంటి సులభం.

**ఆవృత్తచక్షు:-** అంటే మనస్సు విషయాలనుండి మళ్ళిస్తే చాలు పరావృత్తి తత్పరత కావలెను.

నిద్రలో పరావృత్తి వుంది కాని సాత్వికతలేదు. సాత్వికత కూడా వున్నపుడే ఆత్మ దర్శనము. నిద్రలో తమస్సున్నది. నిర్మలత్వములేదు. ఇదే సమాధి సుషుప్తులతేడా.

అపుడు పుట్టిన శిశువుకు అజ్ఞానావృతమైన కారణం చేతనే యేమీ గోచరించదు.

సుషుప్తిలో మనస్సు బ్రహ్మమును గ్రహించదు. ఏలననగా మనస్సుకు రెండవస్థలు 1. ప్రకాశావస్థ (నిర్వికల్పం) 2. విమర్శకావస్థ లేక 1. సవికల్పదశ 2. నిర్వికల్పదశ. ఎదుట వస్తువును తెల్సుకొనే స్థితి ఒకటి. ఏమీ తెలియదనే స్థితి మరిఒకటి.

సవికల్పము(విమర్శకావస్థ) రెండువిధములు - 1. అభినవభాసము, 2. అనుభవము అనుభవించినవి సంస్కారములగును. నిద్ర యనునది ప్రకాశావస్థ. నిర్వికల్పదశ. జాగ్రత నుండి నిద్ర పోయేమధ్య నిర్వికల్ప దశ. జాగ్రతలో నిర్వికల్పదశవున్నా మనము తెలియలేము.

పగలు వంటిది సమాధి - చీకటి వంటిది నిద్ర. నిద్రలో మనస్సుకు బహిర్దృష్టి లేకపోవుట వలన ఆత్మకు మనస్సు సన్నిహితమగును. కనుకనే ఏ బాధలు గోచరించవు. కాని నిద్ర మూఢదశ. స్థూలప్రపంచం కూడా ఆత్మేనని తెలిసినవార్కి నిద్రకూడా సమాధే.

అద్దానికి మసిపూస్తే బింబాన్ని గ్రహించకపోయినా మనస్సును గ్రహిస్తుంది. అట్లే ఏమీ తెలియలేదనేది గ్రహిస్తుంది. ఎక్కడ విమర్శలేదో అది మూఢదశ.

ఏకం అని ఆగక అద్వైతమని ఎందుకన్నారు అంటే ద్వైతం భాసించినపుదు గూడా ఏకవస్తువుగా చూచిన చూపే జ్ఞాని చూపు. చిత్తు దృశ్యాభిముఖమైతే చిత్తము.

సమాధిలో చైతన్యం భాసించును. నిద్రలో అవ్యక్తం భాసించును. జాగ్రత్తలో ఘట పట భేదము కనుపించును. అంతరాళ దశలు సమాధులే. కాని పరిచయం లేక గుర్తించుటలేదు. మనస్సు గూడా బ్రహ్మములో లయమగుటే పూర్ణసమాధి. సమాధికి సముద్ర దృష్టాంతము. నిద్రకు తేనె దృష్టాంతం. సమాధియందు జడత్వం లేదు. సుషుప్తియందున్నది.

జాగ్రద్దశలో సమాధి యెట్లనగా:- అత్యంత ప్రియ భావంలో(అన్యకాంతా సమాలింగనం) అత్యంత భయదు:ఖములోనూ సమాధివున్నది. అవి క్షణిక సమాధులు ఏకాగ్రదృష్టిలోనూ సమాధి ఉన్నవి.

ఆత్మైకత్వములోనే సమాధి ఏకాంత భక్తులకు భగవంతుడు లేనేలేడు.

నిర్వికల్ప సమాధి యనగా బింబములు లేని అద్దము ( చిద్దర్పణము ) గురువు ద్వార వస్తు పరిచయమైతే అంతటా దానిని తరువాత నీవు గుర్తించగలవు.

అన్యం గోచరించనిదే పరిపూర్ణ సమాధి. దానినే ప్రత్యబిజ్ఞా జ్ఞానమందురు. జ్ఞానం హితేషామధికో విశేషో జ్ఞానేన హీన:పశుభిస్సమాన:

1. బహిర్ముఖమైనపుదు మనస్సు. అంతర్ముఖమైతే అదే బ్రహ్మ.
2. దృశ్యవాసనలుంటే మనస్సు - శుద్ధ మనస్సే బ్రహ్మ.

దానికే బ్రహ్మసాక్షాత్కారము. అంతరాళ దశలలోను సంధులలోనూ, ద్రష్టకు దృశ్యానికి మధ్య దశలలోనూ వేద్య రహితమైనది విత్తు భాసించునన్నారు.

సంకల్పరహితమే మోక్షం. స్వరూప ప్రభయే మోక్షము. ఆత్మ కన్నా ప్రపంచం వేరు కాదనుకొన్నవానికి ప్రపంచం ఏమీ బాధాకరంకాదు.

అస్తి నాస్తి అనే వుభయ ప్రత్యయములకు రూపమైన పదార్థములు వుండటానికి వీలులేదు. బంధమనేది నీకు వేరేలేదని తెలియటమే మోక్షము.

అణోరణీయాన్ మహతో మహీయాన్ అంటే కుదిస్తే అణువు పెంచితే మహత్తు కాదు. అణువులోవున్న అణువు మహత్తుమీరిన మహత్తు అనవలె.

రజ్జు సర్పభ్రాంతి రహితమైనట్లు - అనే దృష్టాంతం కుదరదు. దీపాపేక్షచేత పాముకాదని తెలిసినది.- కానీ చిత్ప్రకాశము రజ్జువును ప్రకాశింపచేసే దీపంవలే , ఏది ప్రకాశింపచేయును? మనస్సును బట్టే ఆత్మ ప్రకాశించునని అది జడమనే కొందరంటారు. అది సరికాదు. మనస్సు ఆత్మజ్ఞానానికి కారణం. అయితే అది పూర్ణమెట్లవుతుంది?

ఏదీ లేకపోతే యేదీ భాసించదో,అది తద్రూప మన్నమాట చిత్ లేనిది జగత్తు భాసించదు. కనుక జగత్ చిద్రూపమే. నావిరోధిని చంపేదేవుడు నాకుకావాలంటాడు. నీవే దేవుడవు అంటే ఆదేవుడు నాకెందుకంటాడు.

అజ్ఞులు ఆత్మను ఆకాశంగా చూస్తారు. విజ్ఞులు ఆకాశంను ఆత్మగా చూస్తారు. ఆకాశంనందు ఏనాడూ నీకు ఆత్మభావన కలుగునో ఆనాడు నీకన్యం లేదు. అదివేరుగా చూస్తే సంసారం. ఈ రాశీయే మనకొంప తీస్తున్నది. నీకు కనిపించే ఆకాశం చిదాకాశమని తెలుసుకో.

ఆకాశం జడము. అది యింకొకదానిచేత తెలియబడుచున్నది. ఆత్మ స్వయం ప్రకాశము. రెంటికి ఎక్కువభేదం లేదు. రెండూ నిరాకారములేకానీ ఆకాశమునందు లేని తెలివి ఆత్మయందొకటి ఉన్నది. తెలివితో కూడిన ఆకాశమే ఆత్మ.

ఆవరణమునకు ప్రాధాన్యమిచ్చినపుడు మనస్సనెదరు. చైతన్యమునకు ప్రాధాన్య మిచ్చినపుడు ఆత్మ. ఆత్మకన్న మనస్సు భిన్నముగాలేదు. చలనమైన చిత్తు మనస్సు. అచలమైనచిత్తు బ్రహ్మ.

స్వప్నకాలంలో అది స్వప్నమని తెలిస్తే బాదేవుండదు. చిత్తు లేదన్నావే! ఆలేదనే మాట చిత్తులేనిచో యెట్లు గుర్తించినావు?

| అపరాధవాసన, | కర్మవాసన, | కామవాసన | అని 3 రకాలు |
|---|---|---|---|
| \| | \| | \| | |
| మలదోషము (పాప సంస్కారము) | జడ బుద్ధి | కోరికలు | |

రాజయోగులు= బహుమనస్కులు కనుకనే విషయములనుభవిస్తూనే వైరాగ్యపరులైయుందురు.

అదభ్ర సౌహార్ద్రము = ఆత్మప్రేమ.

'తదభావేన కించన' బ్రహ్మ లేకపోతే జగత్తులేదు. కనుక బ్రహ్మే జగత్తు. జగత్తు మిధ్యంటే బ్రహ్మ కూడా మిధ్యే ననవలసినదే.

నిద్రావస్థ మేఘచ్ఛన్నమైన అర్ధరాత్రివంటిది. సమాధి వెన్నెలవంటిది.

ఆనందగిరి వంటి మొద్దు శిష్యులు గురువులేకనేకడతేరినారు. కేవలం గురువు యొక్క అనుగ్రహము వలనే సర్వ సందేహములు ఏకాత్మతా భావం వల్లనే కాని తీరవు.

అంతర్ముఖమనగా సర్వత్రా ఆత్మదర్శనము చేయుట. వస్తువుయందు సూక్ష్మంగా వున్నదానిని మాత్రమే గుర్తించుట. గురువు అనేఅద్దంలో నీ స్వరూపం నీవు చూసుకొనవలెను. 'అపకారిణి కోపశ్చేత్ కోపే కోప: కథం నయేత్ ' కోపం నీకపకారం చేస్తుందికదా! దానిమీద నీవెందుకు కోపించవు.

మోక్షమునకు ముఖ్య సాధన తత్పరతయే. ఏమీ తెలియక పోతే ఏ సాధనా చేయలేకపోతే ఒకచోట కూర్చుని భగవంతుడు కనపడలేదే అని యేడ్వనైనా యేడ్వు. నీ శరీరము మృణ్మయం కాదు చిన్మయం.

## 7. కర్మనిర్ణయము

**గీ॥ పరిశుద్ధజలమున పరగస్నానముచేసి**
**సురుచిరంబుగ వస్త్ర సూత్ర భస్మ**
**రుద్రాక్షమాలికలు రూఢిగా ధరియించి**
**దర్వు॥ మరియొక్క స్థలములోనూ॥ కూర్చుండి । మర్మముగ**
**మనసుతోనూ॥ పరగకేశవనామాల్॥ ప్రాణాయామంగాయత్రి**
**మరిదైవ స్తోత్రములు గురుతుగ జేయవలయూ॥ మరి॥**

### నైమిత్తిక కర్మ నిర్ణయము

**గీ॥ సమయోచితంబుగ సంకల్ప మొనరించి**
**కలశముస్థాపించి కారణమున**
**సద్గురు మూర్తిని చక్కగా పూజించి**
**దర్వు॥ రామ తారకమంత్రమూ॥** పఠియించుము॥ రహస్య మైన తంత్రమూ॥ కామితార్థములిచ్చి కైవల్యమొసగును నేమముతో దివ్య నామము నమ్మి సదా॥ రామ॥

### షట్కర్మలక్షణ నిర్ణయము

**గీ॥ సాంప్రదాయక ఆత్మ॥ సత్యయజ్ఞముజేసి**
**చేయించవలయును॥ జనులచేత**
**వేదుకార్థముగాను॥ వేదాంత గ్రంథములు**
**దర్వు॥ చదువవలయు తాను॥** జనులచేత॥ చదివించవలయు పూనూ ముదముతో దానము॥ ముందుజేసి తాను పదిలముగ జనులచేత పరిశ్రమించవలయు॥ చదు॥

భక్తి నిర్ణయము

గీ॥ **సకల చరాచర జంతు జాలములోన**
**పరమాత్మ యందును॥ ప్రకటితముగ**
**గాన యందరు అను॥ మానంబు లేకను**
**దర్వు॥ గురువాని యెరుగవలయుగా॥** యెరిగి భక్తి॥ నిరతము సలపవలయుగా॥ పరతంత్రుడయ్యి సదా॥ మురయుచు నహములేక॥ ఒరువడి యనన్యభక్తి॥ భావమునందున॥ గురు॥

గీ॥ **సూక్ష్మహృదయమధ్య॥ సూటిగా నెలకొన్న**
**మెరుపు తీగరీతి॥ మేలిమిగను.**
**ప్రభలు జీవుని మధ్య॥ పరంజ్యోతి యుండునని**
**దర్వు॥ పరమాత్మయని కనరా॥** గురుతుగ సద్గురుమూర్తి యనివినరా॥ సురుచిరముగ పరమ॥ సూక్ష్మ దృష్టినిగని పరమైకాంత భక్తి॥ భావమెరుగుము సదా॥ పర॥

-0-

**సదసద్రహితము:-**

కం॥ శ్రీమత్సీతారామ స్వామి కృపన్ చెప్పనయ్యె సదసద్రహితం బేమి పదార్థమొ దానిని యీ మహికందార్థములుగా యివి వినరయ్యా॥ ఓనరులార యిటుగనరయ్యా॥ వేమారు నేమిమ్మువేడే దింతియె సుమ్మీ॥ నామీద కృప జేసి నను జదువుమని మీరలివి వినరయ్యా॥ ఓ నరులారా యిటు గనరయ్యా॥

అని శ్రీకృష్ణ దేశికేంద్రులవారు సెలవిచ్చి యున్నారు.

గనుక ఈ కందార్థమునందు సదసద్రహితము అచలపరిపూర్ణమనే నిర్ణయమున్నది. సత్ అనగా యేదియో అసత్ అనగా యేదియో విచారించి సదసద్రహితమైన అచల పరిపూర్ణమును తెలిసికొనెదము. సత్ అనగా త్రికాలా బాధ్యత పదార్థము. యెట్టులనగా ఒక ఆకాశమే మహాకాశము, మేఘాకాశము, జలాకాశము, ఘటాకాశమని నాలుగు విధములుగా ఉపాదులను బట్టి చెప్పంబడినట్లు స్వప్రకాశమైన చేతన బ్రహ్మమే బ్రహ్మమనియు, ఈశ్వరుడనియు, కూటస్థుడనియు, జీవుడనియు నుపాదులను బట్టి నాలుగు విధంబులుగా చెప్ప బడుచున్నవి. ఆకాశము అంతటను వ్యాపించి అనంతమైయున్నట్లు బ్రహ్మము అంతటను వ్యాపించి అనంతము యేకముగా యున్నది. పైన మేఘ మండల మందలి ఆకాశమే మేఘాకాశమని యెట్లు చెప్పనగునో అట్లు మాయ యందలి బ్రహ్మము ఈశ్వరుడని చెప్పబడును. ఘటము నందలి యాకాశము ఘటా కాశమన్నట్లు స్థూల సూక్ష్మ కారణములైన శరీరము నకు ఆధారుడు కూటస్థుడనబడును. స్వప్రకాశచేతన బ్రహ్మమగు కూటస్థుడు శరీరాభిమానమువలన భ్రాంతిలో జిక్కి జనన మరణములు పొందుచున్నాడు. శరీరేంద్రియంబులు భ్రాంతి జన్యంబులు. కూటస్థుడనగు నేను స్వప్రకాశమైన చేతన బ్రహ్మము యని గురుమూర్తి చేత

తెలిసికొన్నయెడల కూటస్థుడు బ్రహ్మమగుచున్నాడు. అవస్థాత్రయములకు సాక్షియగు కూటస్థుడు కాలత్రయములకు సాక్షియగు బ్రహ్మము స్వప్రకాశచేతనమే గనుక త్రికాలా బాధితము. స్వప్రకాశమైన చేతన బ్రహ్మము సత్ పదార్థమని నిర్ణయించినారు.

అసత్ పదార్థమేమనగా, శరీర త్రయంబులు స్థూల సూక్ష్మ కారణంబులని మూడు విధంబులు. స్థూలమనగా కరచరణాద్యవయవ ఆకారముగ స్తంభమువలె కనపడునది. 5 జ్ఞానేంద్రియములు, 5 కర్మేంద్రియములు, 5 ప్రాణంబులు, మనోబుద్ధులు 2, యీ 17 తత్వములతో కూడినది సూక్ష్మశరీరము. బుద్ధిగుహయందు మనస్సు జేరుటయే కారణ శరీరము, లేక అజ్ఞానము కారణ శరీరమనబడును. యీ మూడు శరీరంబుల యొక్క వ్యష్టి సమిష్టి లక్షణంబులు అసత్ యని చెప్పబడును. వ్యష్టి సమిష్టి శరీరంబులనగా, ఒక జీవుని స్థూలశరీరము వ్యష్టి శరీరమనబడును. 84 లక్షల జీవోపాదుల స్థూల శరీరముల చేరికకు ఈశ్వరోపాది, సమిష్టి స్థూల శరీరము. ఒక జీవోపాధి సూక్ష్మశరీరము వ్యష్టి సూక్ష్మశరీరము. 84 లక్షల జీవోపాధుల సూక్ష్మశరీరముల చేరికనే ఈశ్వరుని సమిష్టి సూక్ష్మశరీరము. ఒక జీవుని కారణ శరీరము వ్యష్టి కారణ శరీరము. 84లక్షల జీవోపాదుల కారణ శరీరంబుల చేరిక సమిష్టి ఈశ్వర కారణ శరీరము. జీవేశుల వ్యష్టి, సమిష్టి శరీరత్రయంబులు అసత్ అనిచెప్పుటకు కారణమేమనగా? జీర్ణించి పోవునది గనుక శరీరమని చెప్పబడును. దహించిపోవునట్టిది గనుక దేహమని చెప్పబడును. సత్తా హీనమగు నట్టిది గనుక అసత్తని చెప్పబడును. సత్తా స్ఫూర్తి గల స్వప్రకాశచేతన బ్రహ్మము సత్పదార్థమని, సత్తా హీనమగు జడ పదార్థము అసత్ అని వేదాంతమునందు నిర్ణయము.

-0-

I. **మాధవసేవ:-**

ఉపాసనాకాండ. సగుణారాధన. ఏకాగ్రత కుదురును. కామ్య సంకల్పము లీడేరును. భోగపిపాస. సుఖ దు:ఖములలో సుఖం కొరకు.

II. **మానవసేవ:-**

1. ఎందుకు? స్వార్థం కొరకే. కొందరు కీర్తి కొరకు. కొందరు బిరుదులకొరకు సంఘబలము తనవైపు త్రిప్పుకొని ఓట్లు వగైరాలచే తన అధికారపిపాసను శాంతి చేసుకొనుటకు మాత్రమే.
2. మరి కొందరు దొడ్లో కుళ్ళు వుంటే దానిని తొలగించకపోతే యింటి వారికే నష్టం. అట్లే సంఘంలో దు:ఖముంటే తను సహించలేక వాళ్ళ కళ్ళ నీళ్ళ తుడుచుటకు (నాస్తికులు, స్వాభావిక వాదులు చార్వాకులు -భౌతిక వాదులు)
3. లేనివాళ్ళను మరీలేకుండా చేస్తేగాని చూస్తూ వూరుకొంటేగాని శాంతి భద్రతలుండవు. అందుచేచావకుండా బ్రతక్కుండా విడవడం
4. యింకామరికొందరు మరీఅసంతృప్తి వస్తే communisum లాంటివి వచ్చివున్నది కాస్తా పోతుందేమోనని.

అందుచేత పరిసరములు బాగుకై సేవకు పూనుకొనేవారు కొందరు. ముందుతను పిదప

తనకుటుంబం, గ్రామ, తాలూకా. జిల్లా రాష్ట్రం, దేశం యిట్లా మానవుడు పురోగమిస్తాడు. యిదంతా స్వార్ధమే. ఆవిధంగా తనక్షేమం కోసం దేశక్షేమంకోర్తారు. యిట్టి మానవ సేవ మాధవసేవ కంటే ఏమీ గొప్ప కాదు.

నాస్తికులు - భౌతిక వాదులు కూడా సేవచేయాలంటారు.

**III** ఏసుక్రీస్తు - పాశ్చిమాత్యదృక్పథం - పొరుగింటివాని ప్రేమ దేవుని బిడ్డలు. సేవ ఎందుకు చేయాలి?

పరోపకారపుణ్యాయ.....

సేవ:- శరీర మనస్సు లకే ఆత్మకు కాదు.

మహత్తులు:- కార్యరూప దు:ఖనివృత్తి - భౌతికం-

**IV** బుద్ధుడు - కారణ దు:ఖరూపనివృత్తి. తృష్ణానాశనం

మహత్తులుచూపలేదు. మృతశరీరం - ఆనవాలు

సర్వభూతహితే రత: - హంసదేవదత్తుని కధ.

**V** ఋషీశ్వరులు- కాయక, వాచిక, మాన సికము

మానసీకమే 'సర్వ భూత హితే రత:' యజ్ఞదాన తపస్సులు

**VI** చాతుర్వర్ణముల సేవ

ధర్మరాజు- తిష్టమ్ముత్తుని కధ

గురుర్బ్రహ్మ, గురుర్విష్ణు - చాతుర్వర్ణములు.

ఉత్పత్తి స్థితి లయ బ్రహ్మైక్యము.

దృక్పధం:- ఎందుక్క మానవత్వంలో దేవత్వం

ఏతావత్ జన్మసాఫల్యం యత్ దేహినాంయిహ

దేహిషు, ప్రాణై రర్ధైర్ధియా వాచా శ్రేయ ఏవ ఆచరేత్‌సదా॥

**VII** మహావాక్య చతుష్టయము లక్ష్యత్రయముచే భాగత్యాగ పద్ధతిగా శ్రవణాదులు చేసిన యనంతరం మహావాక్యార్ధమునందు నిధి ధ్యాసరూపముగా అఖండ చేతనమును గుర్తించును.

ఆపిమ్మట వార్తిక పద్ధతిగా నిర్వాసన మౌనముద్రా నిష్ఠయందు దృక్స్వరూప చేతనస్థితి శూన్యస్వరూపము చెందుట తెలియును.

అద్వైతుల సామాన్యోపదేశమువల్ల ' యతోవా యిమాని భూతాని జాయంతి, యేన జాతాని జీవంతి యత్ప్రయింత్యభి సంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి' అని యీ జగత్కారణ వస్తువు సర్వదృక్కు లేక సర్వ సాక్షియగు చిద్ఘన స్వరూపముగా గోచరించును.

ఆ అద్వైతులలో ముదురు వేదాంతులు నిర్ణయించిన నిర్వాసనా మౌన ముద్రానిష్ఠ చేయు దృగ్స్వరూప స్థితిని కూడా తొలగించగా అసత్ స్వరూపమే శేషించును. కనుక యీ శూన్యస్థితినే పరమావధిగా నిర్ణయించిన వారగుచున్నారు.

యిక జగత్కారణమేలేదు. సర్వము స్వభావమే ఆద్యంతముల శూన్యమే మిగులుచున్నది. అని తొలుతనే శూన్యస్థితిని ప్రతిపాదించు చార్వాకులకును జీవేశ్వర జగదోపాధులకు బ్రహ్మము కారణమని ఉపక్రమించి,ఉపసంహారమున దానిని స్థిరపరచక చివరకు నిర్వాసన మౌన ముద్రా నిష్ఠాదులనే శూన్యపు బొందలో పడిన వేదాంతులకును తారతమ్యము ఏమీకానరాదు. చార్వాకులు ఆదిశూన్యులు అద్వైతులు అంత్యశూన్యులు. యీ శూన్యమునకే అచలము, పరిపూర్ణము అని పేరెట్టుట ముష్టిదాని కూతుర్కి ధనలక్ష్మి అని పేరెట్టుకున్నట్టున్నది.

## VIII పరిపూర్ణ పరబ్రహ్మమును ప్రతిపాదించుట

అతీత శృతివాక్యములనది అవి నిర్వాసన మౌననిష్ఠ ముద్రాస్వరూప శూన్యస్థితిని ప్రతిపాదించినట్లు చెప్పుకొనుట సిగ్గుకాదేమో?

అద్వైతమతమున సామాన్య, అసామాన్య యుపదేశరూపములుగా నిర్ణయించబడిన అస్తి నాస్తుల యదార్థ వస్తు నిశ్చయజ్ఞానము తెలిసి తమ పూర్ణదృష్టిచే సత్యస్వరూపకమగునిరపేక్షక పరిపూర్ణ పరబ్రహ్మమును ప్రతిపాదించుకొన్న గౌరవమొక్క అచలఋషులకే దక్కినది. అట్టి మహాత్ముల పూర్ణకృపకు పాత్రులైయదార్థస్థితిని గుర్తెరిగిన వారికే అదియుపలభ్యమానము. వారుచెప్పు నది మేము చెప్పే నిర్వాసన మౌనముద్రా నిష్ఠాగరిష్ఠతకన్న యెక్కువేమియుండజాలదనుకొని తృప్తి చెందిన వారి మతియెంతో గతియు నంతే యగును.

నాటక వేషధారిని నాటకములో గుర్తించినట్లే బలంలో రసమును గుర్తించుట.

నాయమాత్మా బలహీనేన లభ్య: - బలంవున్నప్పుడే

రసస్ఫూర్తి: నామ రూపముల యందే అస్తి భాతి.

బలంలేకుంటే రసమునకు ప్రతిష్ఠలేదు.

స్వ, నిర్విశేషం - భావం సవిశేషం

నిర్విశేషం అంటే విశేషాలు స్థిరంకావని చెప్పుటకే.

## IX

1. తురీయంలో అవస్థాత్రయబీజాలు యిమిడినట్లే బ్రహ్మ గర్భంలో కర్మ
   ని + విశేషం = ' ని ' మీద దృష్టి వుంచడం ( అసత్ )
   స + విశేషం = 'స' సర్వ ,, ( సత్ ) కర్మ గర్భిత బ్రహ్మ నిశ్శబ్దంలో శబ్దం ఘనీభవించినట్లు
2. న సత్తన్నాసదుచ్యతే = సత్తని, అసత్తని అనుటకు వీలు లేదు. కాని రెండూ అగును.
3. వృత్తి వార్తికం - అఖండ బ్రహ్మాకారవృత్తి
   సృష్టి వృత్తి ఉత్పన్న సృష్టి సంబంధము. కుండ చేద్దామనే వృత్తి
   జ్ఞానమే మొదటిది - అట్లే సోకామయత బహుస్యాం ప్రజాయేయ'
   ఆ సంకల్పము పూర్వదశ నిర్వాసనా మేళము - అంటే పరావాగ్రూపమై యుండుట.

4. త్వాం వినా విస్వరూపోహం , మాం వినా త్వాం కర్మంస్తిత:
   సీమ బద్దం కాకుంటే పరాత్పరుడు – సీమ బద్ధం అయితేనే మ.న.స్సు
   అని పేరు. " సోకామయత" తోసీమ బద్ధం అవుతాది.
5. 'సర్వధర్మోపపన్నశ్చ'=సర్వ ధర్మములతోనూ కూడకనూవచ్చు, కూడకనూ పోవచ్చు అని ధ్వని
   సత్ = దృక్
   అసత్ = నిర్వాసనా మౌననిష్ఠ
6. అమనస్కం = మనస్సుకు తోచే రూపనామక్రియలు లేకుండుటే
   అమనస్కంగాని మన: ప్రాణ వాక్కు శరీరాలను లేకుండా చేయుట ఎట్లాగు?
   మనస్సునకదిష్టానమగు ( సమిష్టి మనస్సు ) అద్వైత బ్రహ్మమును ఎగురగొట్ట వలసినదే?
7. వెల్తురు లేని చీకటి, చీకటి లేని వెల్తురు వుండుటకే వీలులేదు. సూర్యునికి ఛాయాదేవి భార్య అని గుర్తుంచుకోవాలి. రెంటి రహితం కావాలని పూర్ణులు, చీకటి లేని వెల్తురు కావాలని అద్వైతులు.
8. సముద్రంవలె అగ్నివలె అన్నీ నామరూపాలు యిముద్చుకొని సర్వాకారం సర్వాశ్రయం సర్వశూన్యం అయిన స్థితే నిర్వాసనామౌన నిష్ఠ
9. ప్రతీదానికీ స్థితీ , గతీ
   స్థితీ | నిర్వాసన
   గతీ | వాసన
10. నిర్విశేష — సవిశేషాలు
    బ్రహ్మగర్భంలో కర్మ — కర్మ గర్భంలో బ్రహ్మ
    అ, ని లతో రావాలి — సర్వ శబ్దంతో వాడాలి
    విశేష ఘనం — విశేషవ్యాప్తి
    దీపకాంతి – నిర్విశేషం అగ్నిలో వేడి వెల్తురు ఘనీభవించాయి
    దీపం – సవిశేషం కాంతి నిర్విశేషం.
    దీపం అనగా జ్వాలకే సంబంధం అయీ బుడ్డి చమురు, వత్తి అన్నీ కలిసే దీపం అని వ్యవహారం – అట్లే ఆత్మతో కలిసే అంతా అనాలి.
    ఆశ్రయాశ్రయీ భావం – matter వుంటేనే శక్తికి అస్తిత్వం స్వచ్ఛమైన వర్షబిందువు కాని అందులో క్షారం బైటపడ్డప్పుడు నిర్విశేషంలో కూడా....
11. నిర్విశేష పరాత్పరుడు = తస్య కర్తా రమపిమాం విద్య కర్తార మవ్యయం' --
    స్వరూప సద్యోన్యతమాత్రమే – సాన్నిధ్య మాత్ర కర్తృత్వము – కంటికి చూచే స్వభావం మాత్రమున్నట్లు,

సోఽకామయత బహుస్యాం ప్రజాయేయ " యిచ్ఛామాత్ర ప్రభు సృష్టిః " కి పూర్వ దశ మనస్ససీమితం కానపుడు కేవలం శూన్యభావం మాత్రమై యున్నపుడు. యిట్టి స్థితి మనకున్నూ అనుభవమే. " రసోవైసః "

12. సర్వబలఘనం - యిందు సీమితం కావాలన్న యిచ్ఛ పుట్టింది, యీ యిచ్ఛకు కారణం మహామాయ (మీ యతే అనేన యితి మాయ) యోగమాయ యగును. సున్న చుడితే సీమాబద్ధం ....... point నిర్విశేషం - st line పరాత్పరుడు. సున్న అవ్యయుడు. పరాత్పరుడు. "స ఏకాకనలీయతే"

13. అశరీరం శరీరేషు, అనవస్తే ష్వవస్తితం
మహంతం విభూమాత్వానం మిత్వా ధీరోనశో,,.
మనస్సు చే లందను నూహించినట్టు - ధ్యానానికి మాత్రమే..షం వస్తువు కాదు.
వస్తుతత్వం
నాస్తి తత్వం    అస్తి మీదను ఆధారం
అస్తితో నాస్తి - నాస్తి అనే వాడస్తి కనుక.

14. భర్మ = వైదిక వ్యాకరణ విశేషంచే బ్రహ్మ అయింది.
భరించేది బ్రహ్మ = "భి భర్తవ్య యీశ్వరః" పురుష శబ్దం = యోగమాయే పురం యేర్పాటు చేసేది. మహామాయ పురం యేర్పాటు చేయదు. కనుక పరాత్పరునికి పురుషుడనీ పేరు లేదు స్త్రీఅనీ పేరులేదు.

15. బలం లేకుంటే పరాత్పరుడెలా వుంటాడు " నిష్కళంధ్యాయ మౌనః"
ఘట నిర్మాణానంతరం ఘటత్వం- ఘటముంటే నే ఘటత్వం వున్నట్లు లేకుంటే రానట్లు. అనాసకాయలు తీపి మినహాయిస్తే వుండేదేమి? వూహించుకోగలమా? అట్లే బలహీనమగు రసము దురూహ్యము. భర్త భార్యను పెండ్లాడాడు అనుట వాక్య దోషమే. అట్లాగే నిర్విశేషమున్న దనుటయూ, నోరెత్తితే విశేషమేగాని నిర్విశేషంలేదు.

16. దృష్టి సృష్టి వాదం = తన్ను చూచుకొని పరం విచారించడం
సృష్టి దృష్టి వాదం = సృష్టి ని చూచి తన్ను తెలియుట.
అసంగతం ఆదిలో సృష్టిని చూచినవారెవరు?
నిర్విశేషం    సవిశేషం
స్వ + భావం = స్వస్తిరం, భావాలస్థిరాలు. భావం మారుతుంది గాని "స్వ"ను విడచి వుండదు. అట్లే ఏదో భావం మాత్రం "స్వ"ను యెప్పుడూ విడువదు. "స్వ" నశిస్తే నేతప్ప సాక్షిభూతత్వం కూడా ఒక కర్మే అదియు నొక విధమగు సంకల్పమే................

1, పరిపూర్ణత దనరువాడు = వ్యష్టి భావా పన్నుడుగాక సమిష్టి భావమునెరిగి తన బిడ్డనితో సమముగా అందరినీ ప్రేమింప గల్గినవాడే పరిపూర్ణత దనరువాడు యిదియే రాజయోగ పరమాదర్శము.

2, ఎరుక = యింద్రియముల ద్వారా గుర్తెరుగు జ్ఞానము ( వ్యష్టి)
అఖండ తెలివి = సమిష్టి స్వరూపమైన జ్ఞానం

**తే॥గీ॥ ఎరుక బ్రహ్మంబనె యిల శంకరార్యులు,**
**తెలివి బ్రహ్మంబనె తెలిపె వ్యాసు**
**దెరుక తెల్వుల రెంటి నెరుగదు వేమన,**
**విశ్వధాభిరామ వినురవేమ॥**

దెరుక తెల్వుల రెంటి నెరుగదు వేమన ( అనగా మీరిన దానియందే లగ్నమానసుడు)

3. అచలము = స్వరూపలక్షణం
బయలు = ఉపదేశలక్షణం బ్రహ్మమను మాటయే కూడదు
పరిపూర్ణం = సిద్ధాంతలక్షణం

4. నీటియందుప్రతిబింబము నీరింకినచో నీటితో నశిస్తున్నదా ?లేక బింబముయందు లయించునా? ఉపాధితోనే వశ్యము

5. సత్ పదార్ధము సత్వగుణంవల్లనే చిద్రూపమైనది.

6. శరీరంలో మనస్సు, ప్రాణము, శబ్దము యీమూటికన్న అన్యంకలదా? చైతన్యం కలదంటే యీ మనో ప్రాణములను ప్రబోదించునాచైతన్యము ఏకరూపమా? బహురూపమా? మనస్సు సంకల్ప రూపం మాత్రమే అయితే నిస్సంకల్పస్థితిలో దాని రూపమేమి? రూపమే లేనిచో ఆసంకల్పమే లేక మనస్సే చైతన్య మగును కదా? చైతన్యం వల్ల మనస్సు పనిచేస్తే నిస్సంకల్పస్థితిలో ఆచైతన్యమే మనస్సు అనవలె కదా!

8. చైతన్యము అంత:కరణమందు మాత్రమే గాక శరీరం అంతటా లేక పోతే మిగతా చోట్ల బాధ మొదలగునవి యేల తోచవలె?యెట్లు వున్నది దేహమంతటా?

9. 1.దీపము - దీపప్రకాశము 2 Dymand - current 3 సూర్యుడు ప్రకాశము 4 అవస్థాత్రయములో చైతన్యము అనులోమ విలోమముగా ప్రవర్తించుటచే అది యెట్లు శాశ్వతము?

10. త్రివృత్కరణము - స్థూలాంశ - మధ్యమాంశ - సూక్ష్మాంశములు
అగ్ని - యెముక - మజ్జ - శబ్దము(వాక్కు)
జలము - మూత్రం - రక్తం - ప్రాణం
పృధివి - పురీషం - మాంసం - మనస్సు
అన్నమయకోశ సూక్ష్మాంశమే సమిష్టి అంత:కరణ, కూటస్థుడు.
కూటస్తము - ధ్వన్యాత్మక - వర్ణాత్మక - రూపాత్మకములు
వ్యాపకత్వ - ఆవరణాత్మకములు
యెరుక = కూటస్తుడు = సూక్ష్మాంశము యీ రెంట్కి తన్మాత్రలు కలవు
దీనికఠినాంశమగు పృధ్వియే స్థూలాంశము మరుపు తన్మాత్రరహితమే పరిపూర్ణము.

11. వ్యాపక నిరసన = ద్వాదశి కూటస్త నిరసన = షోదషినిర్ణయ మంత్రం

12. అయం వ్యర్థ: బాహ్యాకోపీనభవతి = దక్షిణామూర్తి
ఏతన్మిధ్య శుద్ధ వియత్ కించిన్నాస్తి = సాందీపవ్యాఖ్యాన మంత్రం
ఈవృత్త బట్టబయలు ఏమీలేదు = శివరామ దీక్షితీయ అర్థం

13. ఛాందోగ్యంలో మన: ప్రాణముల చేరికలో హిరణ్మయశక్తి ఆవరణయందుండు హిరణ్మయశక్తి పరిపూర్ణమెట్లగును?

14. "నైనం ఛిందంతి శస్త్రాణి" etc. చిజ్జడముల చేరికలో శస్త్రముచే ఛేదింపబడును. కాని జడము తనంత తానే ఖండించ జాలదు. ఖండించు దానికంటే ఖండింపబడునది అన్యమా? సచ్చిదానంద లక్షణములచే సచ్చిదానందము బాధింపబడునే కాని అతీత పరిపూర్ణ పరబ్రహ్మమెట్లు బాధనొందును? అందుచే అచలం నిర్ణయమే కానీ సచ్చిదానందముకు చెప్పింది కాదు.

15. తారకం:- షట్చక్రములు ప్రాణమయకోశము నందున్నవి. ప్రాణేంద్రియములు 5 కర్మేంద్రియములు 5 కలిసి ప్రాణమయకోశము.

కర్మేంద్రియ కర్మ కలాపములను సూచించుటకు చక్రములు, ప్రాణములను సూచించుటకు బీజములును నిర్ణయము.రేచక పూరకములు వాగ్రూప కర్మయందుండుటలేదు. ప్రాణము సుషుమ్నయందే యుండును. కనుక ఆ సుషుమ్నయందే ప్రాణమయకోశము. ఈసుషుమ్నయే బాహ్య సుషుమ్న. అంతే గాని సూర్యచంద్రుల నాడులయందుండునది సుషుమ్నకాదు.

16. కూటస్త స్వరూపం నుంచి పరిణామము చెందిన వ్యష్టి అంత: కరణ తన సమిష్టి అంత:కరణ స్వరూపము ఆలక్షణములు వదలి యేల వ్యష్టి అహంకృతితో భాధపడవలె తన స్వరూపము తెలిసి కొనక పోవుటచేతనే యిది అజ్ఞానము కాదు. తెలియని తనము. గోడ అవతలనున్న పేటను తెలసుకొనకపోవుట తెలియని తనమా లేక అజ్ఞానమా? కూపస్తమండూకము కూపస్థజలమే సముద్రమనుకొనినట్లు. దానినే సముద్రము నందు వేస్తే వ్యష్టి లక్షణము రహితమగును. మరియు పరమాత్మ సృష్టి నిర్ణయమును.... శ్రేష్ఠ పదార్థములకుగా అష్టకష్టములు పడుచు రస, రూప, స్పర్శ, శబ్దముల బద్ధుడగు చున్నాడు. యదృచ్ఛాలాభసంతుష్టి గల్గి ఆకలికై దొరికినది తిని... సమిష్టి దృక్పధంతో విశాల హృదయుడగును.

-0-

## 8.పాఠక్రమములు - ముఖ్యాంశములు

### చతుర్విధ శుశ్రూషలు

1. **ఆత్మ శుశ్రూష:-** వర్తనలో యేవిధమైన దుర్లక్షణములేక గుర్వాజ్ఞప్రకారము నడచుకోవలెను.
2. **స్థాన శుశ్రూష:-**గురుస్థానము పల్లె అయినా గుడిశె అయినా నదీ తీరమైనా గురుస్థానమునకు వెళ్ళి విద్య నేర్చుకొనవలెను.
3. **అంగ శుశ్రూష:-** మనస్సు వాక్కు శరీరము (కర్మ) మూడింటిని ఏకం చేసి వర్తించవలెను

4. **భావ శు(శూష:-** కూటస్త స్వరూప రహితమందే వర్తించవలెను. నిర్మిత జేజే లక్షణము పనికిరాదు. యే భావము గురుమూర్తి ముఖతా తెలుసుకొన్నామో ఆ భావన యందే వుండవలెను గాని యే వ్రతములు యే యాత్రలు యే పూజలు చేసినా భావ శు(శూషకు భంగము కలుగును.

## శుద్ధుల వివరము

### స్థూలశుద్ధి

స్థూలశుద్ధి అనిచెప్పుటకు కారణమేమి? శరీరమునకు బాల్య, యవ్వన, కౌమార్య, వార్ధక్య దశలు, వాత, పిత్తశ్లేష్మ రోగంబులు...... ఆసనము వల్ల కాయ సిద్ధి గలిగి మార్పు జేయును. అందుకు శుద్ధనిచెప్పవలసి వచ్చినది.

### ఇంద్రియ శుద్ధి

ఇంద్రియాలకు శుద్ధి అని చెప్పుటకు - ఇంద్రియాలలో మనస్సు సంకల్ప దోషము గనుక తారకముచే మనశ్శుద్ధి యగునని చెప్పబడినది. తారకంబు మనశ్శుద్ధి కారకంబు అని సీతారామాంజనేయములో చెప్పినారు.

### జీవశుద్ధి

జీవునికి శుద్ధి అని చెప్పటానికి కారణము - జీవునకు 24 యింద్రియాలు నేను నేను అనే దోషము వున్నందున అందువల్ల సాంఖ్యము వల్ల ఇరవై ఐదోవాడను నేను అని తెలిసినందున దోషము పోవును. 24 యింద్రియములు జడములు జ్ఞానము లేనిదే ఏపని చేయవు. కావున జ్ఞానమే ఆత్మ అని సాంఖ్య నిర్ణయము. " సాంఖ్య మాత్మ స్వరూప విచారకంబు " అని సీతారామాంజనేయ సంవాదములో చెప్పబడినది.

### ప్రాణశుద్ధి - అమనస్క విచారణ

అమనస్కంవల్ల ప్రాణశుద్ధి అని చెప్పుటకు కారణమేమి? అనగా ప్రాణమునకు ఉచ్ఛ్వాస నిశ్వాసలు అను చలన దోషమువల్ల యోగాభ్యాసకులు శ్వాసను బంధించినందున చలనము పోవునని అమనస్క యోగము చేసిరి.

**శ్లో।। పూర్వదళే పుణ్యమతి । ఆగ్నేయే నిద్రాలస్యం । దక్షిణే క్రూరం। నైఋతే పాపం। పశ్చిమే క్రీడాసక్తి: । వాయువ్యే గమనం ఉత్తరే రతి ప్రీతి: । ఈశాన్యే ద్రవ్యదానం । మధ్యే వైరాగ్యం । కేసరే జాగ్రత: । కర్ణికాయాం స్వప్న । లింగే సషుప్తి: । పద్మత్యాగే తురీయ: ।**

ఈ అష్టవిధ వ్యవహారములు ప్రాపంచీకులకు పారమార్థికులకు ఏకముగా వున్ననూ పారమార్థికుడు ఆత్మ స్వరూప నిశ్చయము కలిగి యున్నందున నీయింద్రియ స్వరూపమునందలి విషయములను గ్రహించక ఆత్మ నిశ్చయమందే వుండి తురీయావస్థయగు ఊర్ధ్వముఖమునందే జాగ్రత స్వప్న సుషుప్తులను బొందును. ప్రపంచీకుడు ఆత్మ నిశ్చయము లేనందున యింద్రియములనుండి గ్రహించబడిన సకల విషయములకు తాను కర్త నను నిశ్చయముపై ప్రకృతి

బద్ధమైన జాగ్రత స్వప్న సుషుప్తియను అధోముఖ అవస్థలు చెందును. తారక యోగము వలన మనోశుద్ధి గలిగి సాంఖ్యయోగము వలన ఆత్మ నిశ్చయము దెలసి మనో ఆత్మల ఏకరూపమైన నిశ్చయమే అమనస్క యోగమని అనుభవ జ్ఞానమని చెప్పబడును.

ప్రాపంచిక పారమార్థికులకు మధ్య వైరాగ్యదీక్ష యుండును. పారమార్థికుడు విరాగి. ప్రాపంచికుడు రాగి. ప్రాపంచికుడు అధోముఖస్థుడు. పారమార్థికుడు ఊర్ధ్వముఖస్తుడు. జాగ్రత లో జాగ్రత మొదలు సుషుప్తిలో సుషుప్తి వరకు అజ్ఞానాశ్రిత జీవుని యొక్క నిర్ణయం। పద్మత్యాగే తురీయ: తురీయంలో జాగ్రత మొదలు తురీయంలో తురీయం వరకు ఈ4 అవస్థలు దైవావస్థలు. ఈ నాలుగవస్థలు వైరాగ్య పద్ధతి తెలిససినవారికే.

## మహావాక్య వివరణ

ఆత్మకు మహావాక్యముల వల్ల శుద్ధి అనిచెప్పుటకు కారణమేమనగా నేను అనే వ్యష్టి గత దోషమున అహం కర్తృత్వముచే యేకైక భావము లేదు. అందుచే నాలుగు మహావాక్యములచే వ్యష్టి పోయి సమిష్టి భావము కలుగును.

### 1. ఋగ్వేదము. ప్రజ్ఞానంబ్రహ్మ. విధివాక్కు స్థూలరహితము

ప్రజ్ఞానంబ్రహ్మ అనగా జ్ఞానేంద్రియములద్వారా పంచ తన్మాత్రలను తెలుపునట్టి దానిని విజ్ఞానమని చెప్పబడును. 84లక్షల జీవోపాదుల యందు యీజ్ఞానమే కలదని తెలియుట ప్రజ్ఞానము. ఆత్మ ప్రకాశము వల్ల జ్ఞానము కలుగుచున్నది. కావున ప్రజ్ఞానమే బ్రహ్మమనిచెప్పబడును.

### 2. యజుర్వేదము అహంబ్రహ్మాస్మి

శిష్యవాక్యము. సూక్ష్మశరీర రహితము. అహం బ్రహ్మాస్మి అనగా అహంఅనే వృత్తి ఆత్మ ప్రకాశము నందు వ్యష్టి జ్ఞానము వలన యింద్రియములకు అహం అనే వృత్తి కలుగుచున్నది. సమిష్టి స్వరూపమునందు యింద్రియ వ్యవహారం రహితమై వ్యష్టి సమిష్టి ఏకమగుచున్నందున అహమనే వృత్తి బ్రహ్మమగుచున్నది.

3. సామవేదము। తత్వమసి బ్రహ్మ। గురువాక్కు। కారణశరీర రహితము.

**తత్వమసిబ్రహ్మ:**

తత్ అనగా సమిష్టి అంత:కరణము. త్వం అనగా వ్యష్టి అంత:కరణము. ఆత్మ స్వరూపమునందు ఏకమగుచున్నవి. ఎట్లనగా ఉదా॥ ఘటమునందుండునట్టిది ఘటాకాశము. (వ్యష్టి) మఠమునందుండునట్టిది మఠాకాశము. ఘట మఠముల విచ్ఛిన్నానంతరము మహకాశముగానే వున్నట్లు వ్యష్టి సమిష్టి అంత:కరణ విచ్ఛిన్నానంతరము బ్రహ్మమే అగుచున్నది.

### 4. అధర్వణవేదము।

అయమాత్మ బ్రహ్మ। సాక్షాత్కారవాక్కు అయమాత్మబ్రహ్మ అనగానమిష్ట వ్యష్టి అంత:కరణయందుయే ఆత్మ అయితే నిర్ణయింపబడినదో ఆ యాత్మయే బ్రహ్మము గాని యితర మేదియు బ్రహ్మము కాదు.

## పంచభూత సృష్టి స్థూల పదార్థ విభజన

1. ఆకాశము అంశగుణములు - కామ క్రోధ (శోక) లోభ మోహ భయములు
   1) ఆకాశము యొక్క ముఖ్యభాగం లేక అర్ధాంశము శోకము.
      (శోకము గల్గినచో శరీరము శూన్యమువలె నగును గనుక)
   2) ఆకాశమున వాయు భాగము చేరుటచే కామము
      (కామరూప ప్రవృత్తి చంచలము గనుక)
   3) ఆకాశమున తేజో భాగము చేరుటచే క్రోధము
      (క్రోధముచే శరీరం తప్త మగును గనుక)
   4) ఆకాశమున జలభాగము చేరుటచే మోహము
      (పుత్రాదులయందు మోహముపుట్టి జల బిందువుల వలె ప్రవహించును గనుక)
   5) ఆకాశమున పృధ్వీ భాగము చేరుటచే భయము
      (భయము కలిగినపుడు శరీరము పృధివి వలె జడమగును)
      కదులుట వణుకుట పరుగుట దాటుట ముడుచుట

2. వాయువు - చలనము, కంపన, ధావన, ప్రసరణ ఆకుంచనము
   1. వాయువు యొక్క ముఖ్య భాగము ధావన లేక పరుగుట
      (వాయువు పరుగెత్తును గనుక)
   2. వాయువులో ఆకాశ భాగము చేరుటచే ప్రసరణ లేక దాటుట
      (ఆకాశము ప్రస్వతం గనుక)
   3. వాయువులో అగ్ని భాగము చేరుటచే కంపణ అనగా వణుకుట
      (తేజస్సు పొంగించును గనుక)
   4. వాయువులో జలభాగం చేరుటచే చలనము
      (జలం చలము గనుక)
   5. వాయువు లో పృధివి భాగము చేరుటచే అకుంచము లేక ముడుచుట
      (పృధివి అకుంచితం గనుక)

3. అగ్ని - నిద్ర దప్పి ఆకలి సంగమము ఆలస్యము
   1. అగ్నియొక్క ముఖ్యభాగం ఆకలి
      (భక్షితాన్నం భస్మ మగును గనుక)
   2. అగ్నిలో ఆకాశభాగము చేరుటచే
      (ఆకాశము శూన్యము [illegible] శరీరము శూన్యమునూ గనుక)
   3. అగ్నిలో వాయుభాగం చేరుటచే దప్పి
      (వాయువుచే తడిగుడ్డ ఎండిపోవునటుల వేడి గాడ్పుచే కంఠము
      శోషించి దప్పి గల్గించును)
   4. అగ్నిలో జలభాగము చేరుటచే - సంగమం
      (జలమునకు ఇచ్ఛాశక్తి సహజమై ఇచ్ఛ గలిగించును)

5. అగ్నిలో పృధ్వి భాగము చేరుటచే ఆలస్యము.
(పృధ్వివలెనే ఆలస్యముచే శరీరము జడమగును)

4. జలము - చొల్లు, చెమట, మూత్రము, రక్తము, శుక్లము
1. జలము యొక్క ముఖ్యభాగము రక్తము.
2. జలములో ఆకాశభాగము చేరుటచే చొల్లు.
(ఆకాశము వలె వృచ్ఛ నీచము గనుక)
3 జలములో వాయుభాగము చేరుటచే చెమట.
(వాయువు ఉఛ్వాసనిశ్వాసములు వేగముగా వెడలుట)
4. జలములో అగ్ని భాగము చేరుటచే మూత్రము.
(వెచ్చగా నుండును గనుక)
5. జలములో పృధ్వి భాగము చేరుటచే శుక్లము
(పృధ్వి జలము చేరికలో వలె శుక్లమున్నూ ఉత్పత్తి హేతువై యున్నది)

5.పృధ్వి - రోమములు, చర్మము, నరములు, మాంసము, అస్థులు
(త్వక్కు) (నాడులు)
1. పృధ్వి ముఖ్యభాగము అస్థులు
(రెండున్నూ కఠోరములు గనుక)
2. పృధ్వి యందు ఆకాశభాగము చేరుటచే రోమములు.
(కత్తిరించిననూ బాధపెట్టవు ఆకాశమువలె శూన్య రూపము)
3. పృధ్వియందు వాయు భాగము చేరుటచే చర్మము.
(వాయువు చర్మము రెండున్నూ స్పర్శ నెరుంగును గనుక)
4. పృధ్విలో అగ్నిభాగము చేరుటచే నరములు లేక నాడులు.
(నాడులయందు ఉష్ణ పరీక్ష జరుగును)
5. పృధ్విలో జలభాగము చేరుటచే మాంసము
(మాంసమందు తడిగా ఉండును)

## జాగ్రత - స్వప్న - సషుప్తి తుర్యావస్థల భావన

ప్రకృతి పురుషాంశములైన నేను మేనులకు స్థూలాతిస్థూలమైన స్థూలశరీరమందు శరీరము 25 యింద్రియములు యీ యింద్రియాధి దేవతలు చైతన్యమైన జీవుడు జీవచలనరూపమైన ప్రాణము ప్రాణచలనమునకు సర్వ సత్తాంశ ప్రకాశ స్వరూపమైన ఆత్మ ప్రకాశము కలసి సకల వ్యవహారములు క్రియా పూర్వకముగా జరుగుచున్నవి. ఎట్లనగా అతఃకరణము ప్రాణవాయువుతో కలసి నేత్రేంద్రియము ద్వారా బయటికిపోయి బాహ్యప్రకాశముతో కలసి సకలదృశ్యప్రపంచ పదార్థములకు నేనే కర్తననెడి విశ్వాభిమానముతో అనగా విశ్వుడనెడి పేరుతో సకల సుఖదు:ఖములు అనుభవించుచుండును. యీ అవస్థయందు ద్వంద్వపూరితమైన సుఖదు:ఖాత్మకమే గాని ద్వంద్వ రహితమైన శాశ్వత సౌఖ్యము లేదనెడి ఊహతో స్థూలదేహమును గుర్తెరిగే జ్ఞాతను

చింతనాభిమానములైన చిత్త అహంకారములను విషయేంద్రియములను విడచి సూక్ష్మదేహమందు కంఠస్థానమునమనః ప్రాణములతో అనగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణేంద్రియ మనో బుద్ధులతో స్వప్నరూపమును కంఠస్థానమున హితయనే నాడియందు మనఃప్రపంచకమును కల్పించుకొని భావనారూపమైనక్రియలు అంతఃప్రకాశముతో తైజసుడనెడి పేరుతో ననుభవించును గనుక యీ శరీర స్వప్నావస్థయందు కూడా ద్వంద్వ పూరితమైన సుఖదుఃఖములు తప్ప శాశ్వతమైన సౌఖ్యము కాన్పించుట లేదనెడి భావముతో జ్ఞానేంద్రియ ప్రాణేంద్రియములను విడచి కేవలము మనోబుద్ధులతో మాత్రము కారణ దేహమును పొంది కేవలము జ్ఞానమయమై సుషుప్త్యావస్తయందు హృదయ స్థానమున ప్రాజ్ఞుడనెడి పేరుతో అవిద్యా వరణముయొక్క అజ్ఞానమునందు వుండును. యీ అవస్తయందు కూడా శాశ్వత సౌఖ్యము కానరాక ప్రకాశస్వరూపమైన మహాకారణ దేహమునందు తురీయావస్త యందు మూ ర్ధ్ని స్థానమున అనగా తనయొక్క స్వస్థానమునందున ప్రత్యగాత్మ యనెడి పేరుతో సర్వసాక్షి స్వరూపుడై శాశ్వత సుఖస్వరూవమును అనుభవించుచున్నానని తలచుచుండును.

1. యింద్రియములయందు మలదోషము
2. జీవునియందు విక్షేప దోషము
3. ప్రాణమునందు ఆవరణదోషము

యీ మూడు అవస్థలయందు మూడు దోషములు. యీ మూడు దోషములే కాలత్రయ స్వరూపము. యీకాలత్రయ స్వరూపమే త్రిగుణ లక్షణము. యీత్రిగుణ లక్షణమే మహదవ్యక్తాది స్థానములు. యీ మహదవ్యక్తాది స్థానములే సర్వసృష్టి స్థితి లయములకు అనగా జీవేశ్వర జగదుత్పత్తికి కారణము.

1. పిండాండము 2. బ్రహ్మాండము 3. బ్రహ్మాండాతీతము.

పిండాండమందు అవిద్యాఆవరణము. జీవుడు. కర్త భోక్త అనగా చేయువాడు భోగించువాడు.

2. బ్రహ్మాండమునందు మాయా ఆవరణము. ఈశ్వరుడు. కర్త భోక్త

3. బ్రహ్మాండాతీతమునందు ప్రకృత్యావరణము పరమాత్మ. కర్త భోక్త

1. పిండాడమందు మల విక్షేపావరణ దోషము.
2. బ్రహ్మాండమునందు మాయావరణతో కూడిన కాలత్రయ స్వరూపమునందు సృష్టి స్థితి లయముల దోషానుభవము.
3. బ్రహ్మాండాతీతమునందు ప్రకృత్యావరణతో కూడిన కాల కర్మ చక్ర ఫల స్వరూప దోషానుభవము.

## చతుర్విధ దీక్షలు

1 నిశ్చల సమయ దీక్ష 2. నిరామయ నిర్వాణ దీక్ష 3. అద్వయ అమల దీక్ష 4. త్వష్టీభూత నిర్దేహ పరిపూర్ణ దీక్ష

## పంచముక్తులు

1. సద్యోన్ముక్తి 2. క్రమముక్తి 3. జీవన్ముక్తి 4. విదేహముక్తి 5. కైవల్యముక్తి

### వివర్తమనగా

అధిష్ఠానముకంటే విపరీత స్వభావము కలదియు, నన్యదా స్వరూపము గలదియు వివర్తమనబడును.

### పరిణామమనగా

వుపదాన కారణముతో సమానమగు స్వభావముకలదియు నన్యదా స్వరూపము గలదియు పరిణామమని చెప్పబడెను.

### పంచభూతోత్పత్తి

ద్వంద్వ స్వరూపమైన అనేకపరమాణువుల యొక్క చేరికచే భూతములాయెను. ఈ భూతములే భౌతిక స్వరూపమైగన్పించు ప్రపంచము. సర్వ సత్తాంశ స్వరూపమైన అనేక పరమాణువుల యొక్క చేరికచే సర్వాకారము పాటలీ వర్ణము సర్వసత్తాంశ స్వప్రకాశ స్వరూపమైన ఆత్మాయెను. దీనికి స్థూలమై అవకాశాంశ స్వరూపమైన అనేక పరమాణువులయొక్క చేరికచేత వర్తులాకారం । సునీలవర్ణము । అవకాశాంశ స్వరూపమైన ఆకాశమాయెను.

### పంచభూతముల కర్మ ధర్మములు

| | | | | |
|---|---|---|---|---|
| ఆకాశము | బయలైయుండుట ॥ | ధర్మము | అవకాశ మిచ్చుట ॥ | కర్మము |
| వాయువు | చలించుట | ॥ | చేర్చుట | ॥ |
| అగ్ని | వెలుగుట | ॥ | కాల్చుట | ॥ |
| జలము | విచ్చుట | ॥ | పదునుచేయుట | ॥ |
| పృధివి | స్నేహించుట | ॥ | ధరించుట | ॥ |

భూతములు యొక్క కర్మ ధర్మములు

| | | |
|---|---|---|
| | నిజాంశము | కల్పితాంశము |
| ధర్మములు | నిర్వికల్పము | సవికల్పము |
| | సూక్ష్మము | స్థూలము |
| | సాక్షి | సత్తా |

సర్వసత్తాంశ స్వప్రకాశ స్వరూప ధర్మకర్మములను వ్యష్టి సమిష్టుల యందు నేను మేనుల యందు నిర్ణయించి శుద్ధి సిద్ధులను కర్మ ధర్మముల యందు నిర్ణయించుట.

### చక్రముల నిర్ణయము

1. అంత:కరణము జగద్వ్యాపారము చేయునప్పుదు నిల్వ ఆధార మైనందున మూలాధారమనియు.
2. తన ప్రభావము చూపనాశ్రయింపబడుటవలన స్వాధిష్టానమనియు
3. సాధకుడు తన స్వరూపము యందు నవరత్నంబుల వర్ణంబులు తెలియజేయుట వలన మణిపూరక మనియు
4. సాధన సమయమందు ప్రపంచీకుల శబ్దము తెల్పనీయక తన యందలి దశనాదంబులను వినజేయుటవలన అనాహతము అనగా బాధజేయనిది అనాహతము.

5. సాధకుడు తన్ను శుద్ధ స్ఫటికాకృతిగా తలంచుటకు స్థానమైనందున విశుద్ధమనియు.
6. తన యాజ్ఞ చెల్లించుటకు స్థానమైనందున ఆజ్ఞేయమనియు.
7. సకల సంకల్పంబులకు కారణమైనందున సహస్రారమనియు.
8. 84 లక్షల జీవోపాదులకు ఫలంబు నొసంగుటకు కారణమైనందున కర్మచక్రమనియు.
9. సృష్టికి మూలకారణమైనందున కాలచక్రమనియు యీ ప్రకారంబు చక్రనిర్ణయము చేయనైనది.

## దళనిర్ణయములు

దళనిర్నయము 1-2 3-4 5-6 -7

8వ చక్రము కర్మ చక్రము - బ్రహ్మాండము కారణము అనగా మహతత్వము గనుక బ్రహ్మాండమునందలి జీవోపాధులు కర్మ భేధము వలన 84 లక్షల జీవోపాధులు గనుక కర్మ చక్రమునకు కారణమైన బ్రహ్మాండమునకు 84 లక్షల దళంబులు. 9వచక్రము బ్రహ్మాండాతీతమగు సాక్షి భూతము. విషయము గనుక 84 లక్షల జీవోపాధులకు దైవోపాదులకు నియమిత దైవములకు కాలమనునది ఏకమే గనుక కాల చక్రమునకు ఏక దళమని చెప్పబడెను.

దైవనిర్ణయమెట్లులనగా నవవిధములైన చక్రములయందు వృత్తులను తెల్యజేయు యెరుకను వృత్తి భేదము వలన విఘ్నేశ్వరుడని, బ్రహ్మని, విష్ణువని, రుద్రుడని, ఈశ్వరుడని, జీవుడని బ్రహ్మమని ప్రవర్తించిరి. యీ నవ చక్రంబు ప్రాణమయ కోశంబుకు సంబంధ మెట్లు లనగా అన్న రసంబుతో నగునది పంచ ప్రాణంబులు ప్రబలి కర్మేంద్రియ పంచకంబును గూడి ప్రాణమయము. యీ ప్రాణమయ కోశము క్రియా సంబంధము. ఆకలి దప్పులు దీని ధర్మంబులు గనుక చక్రంబులు దళంబులు క్రియారూపమైనందున చక్రంబు ప్రాణమయ కోశ సంబంధమని చెప్పబడును. అయినా ఆధార స్వాధిష్టాన మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞేయ, సహస్రారంబులనే ఏడు చక్రంబులు అవిద్యా రూపమైన పిండాడమందు వ్యష్టి ప్రాణమయకోశ సంబంధము. కాలచక్రము కర్మ చక్రము మాయావరణ రూపకమైన బ్రహ్మాండమునందు సమిష్టి ప్రాణమయకోశ సంబంధము గనుక చక్రంబులు భ్రాంతి జన్యంబులు గనుక యీ సాధనము అవసరములేదు.

## దశవిధ నాదములు

1. చిణీ 2. చిణిచిణీ 3. ఘంటానాదము 4. మృదంగము 5. మేఘ
6. శంఖా 7. వీణా 8. తాళ 9. వేణు 10. భేరి దశవిధ నాదంబులు.

యీ నాదోద్భవమెట్లులనగా పంచప్రాణంబులు ప్రబలి కర్మేంద్రియ పంచకంబును గూడి ప్రాణమయము అనే న్యాయమున ప్రాణమయ కోశాంతరములగు 1. రత్నాహ్వాయ 2. శినీవాలి 3. సుషుమ్న 4. గాంధారి 5. హస్తిని 6. పూష 7. పయశ్విని 8. అలంబ 9. కూహు 10. జిహ్వా శంఖిని అను దశనాళంబులు

వాటి అధిదేవతలు స్థానంబులు ఏవనగా

1. యిడా నాడికి = ఎడమ నాసికము = చంద్రస్థానము రుద్రుడు అధిదేవతలు
2. పింగళనాడి = కుడినాసికము = సూర్యస్థానము విష్ణువు
3. సుషుమ్ననాడి = బ్రహ్మరంధ్ర స్థానం అగ్నిస్థానము బ్రహ్మ

4. గాంధారినాడి = కుడికన్ను స్థానం = వర్ణుడు
5. హస్తినినాడి = ఎడమకన్ను స్థానం
6. పూషనాడి = కుడికర్ణస్థానం = దిగ్దేవతలు
7. పయశ్విని = ఎడమకర్ణస్థానం = పద్మోద్భవుడు
8. ఆలంబుషనాడికి = గుదనాళస్థానం = సూర్యుడు
9. కూహునాడికి = మధ్యనాళస్థానం = భూమి అధిదేవత
10. శంఖిని నాడికి = నాభిస్థానం = భూమి అధిదేవత

యీ నాడులు వాని అధిదైవముల ప్రేరేపణచే సకల కార్యములుచేయుచుండును. యీ నాడుల అభిమానులగు ఆధిదైవముల కార్యములందలి శబ్దములనే దశవిధనాదంబులనబడును. ఎట్లనగా

1. యిడా నాడియందు = చిణీనాదము
2. పింగళనాడియందు = చిణిచిణీనాదము
3. సుషుమ్ననాడియందు = ఘంటానాదము
4. గాంధారినాడి యందు = మృదంగనాదము
5. హస్తినాడి యందు = మేఘనాదము
6. పూషనాడియందు = శంఖానాదము
7. పయశ్విని నాడియందు = వీణానాదము
8. ఆలంబుషనాడియందు = తాళనాదము
9. కూహునాడియందు = వేణునాదము
10. శంఖిని నాడియందు = భేరీనాదము

యీ దశవిధనాడులయందు దశవిధనాదంబులు యుండును. యీ నాదంబులలో సుషుమ్న నాడి నాదమగు ఘంటానాదమందు మనస్సు లయపరచినవారు మోక్షమునొందగలరనే భ్రాంతిచేత కర్ణరంధ్రములను మూసి యీదశవిధనాదంబుల నాలకించుచు తుదకు ఘంటానాదమునందు మనస్సు లయపరచెదరు. దీనికే లయయోగభ్రాంతి యనెదరు.

### త్రి విధదీక్షలు

1. దృగ్దీక్ష   2. వాగ్దీక్ష
3. స్పర్శదీక్ష

1. బాహ్యదృష్టి   2. అంతరదృష్టి

1. అభిమానసహితమైన మృతదృష్టి
2. అభిమాన రహితమైన అమృతదృష్టి.

### ద్వాదశి వాక్యంబులు

1. విధి వాక్యము
2. బంధమోక్ష వాక్యము
3. అవిద్యనిందా వాక్యము
4. జగన్మిధ్యా వాక్యము

1. నానావిధ లింగ స్వరూపము
2. పుల్లింగ స్వరూపము
3. స్త్రీలింగ స్వరూపము
4. నపుంసక లింగ స్వరూపము

5. ఉపదేశ వాక్యము
6. జీవబ్రహ్మైక్య వాక్యము
7. మనన వాక్యము
8. జీవన్ముక్తి వాక్యము
9. స్వానుభూతివాక్యము
10. సమాధి వాక్యము
11. ఫలవాక్యము
12. విదేహముక్తి వాక్యము

5. ఆత్మ స్వరూపము
6. సర్వస్వరూపము
7. బ్రహ్మస్వరూపము
8. అవశిష్ట స్వరూపము

ద్వాదశ వాక్య బోధకు
అష్టవిధ స్వరూప నిర్ణయము

### బ్రహ్మవిచారణయందు రెండు విధములు

1. వేదాంతము 2. వార్తికము

వేదాంతమునకు ------------------ మహావాక్యచతుష్టయము.
వార్తికమునకు ------------------ ఏకమేవాద్వితీయం బ్రహ్మ.

ఓం మిత్యేకాక్షరం బ్రహ్మ - సర్వం ఖల్విదం బ్రహ్మ.

నేహనానాస్తి కించన। అనే అవాంతర వాక్య చతుష్టయము. మహావాక్య చతుష్టయమునందు మలిన సత్వప్రధాన సహిత బ్రహ్మమును। అవాంతర వాక్యమునందు అమల సత్వ ప్రధాన సహిత బ్రహ్మమును భోధింపబడి యున్నది.

### 16 దశలు

బాల్య, యవ్వన, కౌమార, వార్ధక్యము.
బ్రహ్మచర్య, గృహస్త , వానప్రస్త, సన్యాసము
అవస్త యొక్క పదార్ధానుభవ పరిణామ దశనుబట్టి సప్తసంవత్సరములు కాక తురీయావస్త యొక్క మార్పును చతుర్విధములుగా నిర్ణయించిరి.

1. బ్రహ్మచర్యము 3 విధములు
   1. ప్రజాపత్య బ్రహ్మ చర్యము 2. వైదిక బ్రహ్మచర్యము 3. నైష్ఠిక బ్రహ్మచర్యము
2. గృహస్తాశ్రమము 4 విధములు
   1. వార్తావృత్తి
   2. ఆచారవృత్తి
   3. సేవానవృత్తి
   4. శిలోచనవృత్తి
3. సన్యాసాశ్రమునందు 4 విధములు
   1. బహూదకుడు
   2. కుటీచకుడు
   3. హంస
   4. పరమ హంస
4. వానప్రస్థము నందలి 4 విధములు
   1. ఔదంబరుడు 2. శేనసుడు 3. సంప్రక్షాళి 4. పౌర్నముడు

### గురుని లక్షణము

1. రహస్య నిశ్చయ జ్ఞానము నందు ప్రీతి
2. క్షరాక్షరోపాధి ద్వయదోషరహిత స్వరూపజ్ఞాన నిశ్చయ మనే ధైర్యము.

3. దుర్లభమైన మానవజన్మము నందు నీతి దుర్లభమైన వివేక జ్ఞానానుభవమనేసంతోషము.
4. స్వాభిమాన రహితమైన సత్యవాక్య పరిపాలనమనే మౌనమును.
5. పరమాత్మ సృష్టికి వ్యతిరేకంగాని గృహస్థాశ్రమ ధర్మ ఏకపత్నీవ్రతము.

## త్రిగుణ సృష్టి

1. శరీర సంయోగము
2. వాక్య సంయోగము — బ్రహ్మ స్వరూపమైన శబ్దముచే సత్యమును వచించుట
3. మానసిక సంయోగము

1. పరమాత్మ సృష్టియందు సృష్టించబడిన పాంచభౌతిక శరీరములు సప్తధాతులవేగాని వేరుకాదని తెలియును.
2. సకల కార్యములకు మూలమైన శబ్దము బ్రహ్మసంబంధము గనుక అట్టి శబ్దము వలన అసత్యము వచించిన తనకు ప్రపంచమునకు అనర్ధము సంభవించునని తెలియుట
3. సకల సంకల్పములు శరీరపోషణార్ధమైనవి. శరీరము హేయరూపమైనందున అశాశ్వితము. పారమార్ధిక నిశ్చయజ్ఞానమే పరమానందమని తెలియుట (జ్ఞానులు తెలిసి నందున సత్యమునే వచింతురు)

| | | |
|---|---|---|
| బ్రాహ్మణములు | ---- కర్మము | --- తమోగుణప్రధానులు |
| సంహితములు | ---- భక్తి | --- రజోగుణప్రధానులు |
| అరణ్యకములు | ---- జ్ఞానము | --- సత్వగుణప్రధానులు |

## ఉపనిషద్వాక్య స్వరూపనిర్ణయము

1. విధివాక్యము ( ద్వాదశవాక్యంబులకు )
   ముముక్షువు బ్రహ్మవిద్యను తెలుసుకొను పద్ధతి విధింపబడి యున్నది.
2. బంధమోక్షవాక్యము.
   బంధము యే కారణము వల్ల కలుగుచున్నది.
   మోక్షము యే లక్షణము వల్ల కలుగు చున్నది, అనే విధానము చెప్పబడియున్నది.
3. అవిద్య నిందా వాక్యము.
   తనకంటె పరుడు గురుదేవుడొక్కడున్నాడు అనియు జీవేశ్వర భేదంబు కల్పించి ఉపాసించు చున్నాడో వాడు పశువు. ఎట్లనగా నానాత్వము వున్నట్లు చూచుచున్నందున మృత్యువు వలన నాశనము పొందుచున్నాడు.
4. జగన్మిధ్యా వాక్యము.
   బ్రహ్మకన్న నితరమైనది ఏదియును లేదని నిర్ణయింపబడియున్నది.
5. ఉపదేశవాక్యము.
   యీ సర్వ ప్రపంచమునకు కారణ కార్య స్వరూపమైన బ్రహ్మమే ఆత్మ. ప్రత్యగాత్మ పరమాత్మ యనే నామంబులచే నీవు నేననే వ్యవహారములు కలిగినదని నిర్ణయింపబడియున్నది.ల
6. జీవబ్రహ్మైక్యవాక్యము.
   జీవుడు, ఈశ్వరుడు, బ్రహ్మము అని వుపాధి భేదంబులచే తెలియబడుచున్నది. వుపాధి

భేదంబులచే తెలియబడుచున్నది. వుపాధి రహిత స్వరూపమునందు సర్వము బ్రహ్మమేనని నిర్ణయింపబడియున్నది.

7. మననవాక్యము.
భోజ్యము నేనే, భోక్తయు నేనే సూర్యుడను నేనే యని నిర్ణయింపబడియున్నది.

8. జీవన్ముక్తి వాక్యము.
జగజ్జీవేశ్వరాధి భేదంబులు ప్రతీతి మాత్రమేగాని వాస్తవముగా బ్రహ్మ స్వరూపమేనని నిర్ణయింపబడినది.

9. స్వానుభూతి వాక్యము.
ప్రత్యగాత్మ పరమాత్మలు నేనే. నేననగా జీవుడు. పురుషుడనగా కూటస్థుడు. వాడనగా పరమాత్మ.యివి యన్నియు నేనే నని నిర్ణయింపబడియున్నది.

10. సమాధివాక్యము.
ధ్యానసమయమున నిధి, ధ్యాసను, నేను ధ్యానించుచున్నాను. పరబ్రహ్మ ధ్యానింపబడినది. భేద జ్ఞానము లేని స్థితి.

11. ఫలవాక్యము
ఆ స్పర్శ యోగమే సమాధి యని నిర్ణయింపబడినది.

12. విదేహముక్తి వాక్యము.
అందు క్షరాక్షరోపాధి రహితము. విధేహముక్తి యని చెప్పబడియున్నది. చెవికి చెవియై, మనస్సుకు మనస్సై ప్రాణమునకు ప్రాణమై యేచేతన స్వరూపము వున్నదో అదిబ్రహ్మము అని నిర్ణయింపబడియున్నది.

13. 1. ద్వాదశవాక్యబోధకు అష్టవిధస్వరూపంబులు నిర్ణయింపబడినవి.
2. అమల స త్వప్రధానము నిర్ణయింపబడినవి.
3. మలిన సత్వప్రధానము నిర్ణయింపబడినవి.
4. మహా స్వరూపంబగు చేతనము నిర్ణయింపబడినది.
5. నామరూపంబులు లేనిది బ్రహ్మము. నామరూపంబులు గలది ఆకాశమని నిర్ణయింపబడినది.
6. సర్వస్వరూపంబునందు తెలుసుకొనునది తెలియబడునది బ్రహ్మమనే నిర్ణయింపబడినది.
7. సర్వ స్వరూపంబునందు సత్యమైనది, జ్ఞానమైనది, అనంతమైనది బ్రహ్మమని నిర్ణయము.
8. అవశిష్ట స్వరూపము సర్వమునకు విలక్షణము నిర్ణయింపబడినది నేతి నేతి మహావాక్య అర్ధస్వరూప భావముగలదు.

14.

| కవచము | - అస్త్రము | - శక్తి | - బీజము | - దేవత |
|---|---|---|---|---|
| 1.సర్వ | సత్తా | అంశ | స్వప్రకాశ | స్వరూపము |
| 2.దేహం | యింద్రి | జీవ | ప్రాణ | ఆత్మ |
| 3.ఆసన | తారక | సాంఖ్య | అమనస్క | మహావాక్యం |
| 4.శుద్ధి | కర్మభోగ | భుక్తిక్రియ | కల్పితాంశము | |
| 5.సిద్ధి | ధర్మభోగం | ముక్తిక్రియ | ముఖ్యాంశము | |

**15. ఇహపరంబులయందు అచలప్రభోధయందలి గురుశిష్యులు చేయు కార్యంబులు యేమి?**

1. శ్రీబ్రహ్మవిధ్య = గురుశిష్యుల నిర్ణయము.

2. గురుమూర్తి = అచల పరిపూర్ణ పరబయలు యందు, వ్యవహారము శూన్యము. ఇహపరములకు చేయునట్టి పనిలేదు.

విష్ణువు = గురువు - శిష్యుడు సూర్యుడు.

సూర్యుడు = ఇహపరమందు చేయుపనిఏదనగా

84 లక్షల జీవోపాదులయందు అజ్ఞానమునందు బడి నసించక యుండునట్లు ప్రకాశవంతము చేయుట. తన పద్ధతియందు భ్రాంతి రహిత స్థితిగా యుండుట ఇది శిష్యుడగు సూర్యభగవానులు ప్రపంచపారమార్ధముల యందు చేయుపని.

విష్ణువు = గురువు చేయునట్టి పని ఏదనగా మానవులు ఇహమందు జ్ఞానశూన్యులై అధర్మపరులుగా యుండి ధర్మపరులను హింసించున్నప్పుడు ఉపాది బద్ధుడై దుష్టులను శిక్షించి శిష్టులను రక్షించుట. తన స్వరూపమగు పరమందు భ్రాంతి రహితుడై యుండుట.

3. యాజ్ఞవల్క్యయగు గురువుయొక్క పద్ధతి యేమనగా బ్రహ్మవిద్యసభలుచేయించి తమ పరిపూర్ణ సిద్ధాంతమును ప్రభోధించుట పరమందు భ్రాంతి రహిత స్థితి కలిగియుండుట.

4. జనకుడు –శిష్యుడు = తాను కడ తేరుటకు యేది నిజధర్మమని తెలియనైనదో అందు యితర అవలక్షణంబులుఆచరణంబులని ప్రవేశించి నిజధర్మమును మరుగుపరచకుండా వేదాంత సభలు చేయించి నిజధర్మమును రక్షించుట.

5. శుకుడగు గురువు = ఇహమందు చేముపని యేదనగా తాను ధారేషణ, ధనేషణ, పుత్రేషణలకు భయపడి వైరాగ్య దీక్షచే హఠముతో యుండగా జనకుని ప్రబోధ వల్ల ఈషణత్రయముల భీతి బాపి ధీరుడై వివాహాది సంస్కారం పొంది సంతానము బడసి భ్రాంతి రహిత స్థితిని పొందియున్నాడు. దానివల్ల సన్యాస పద్ధతి నిరసింపబడ్డదని వేరుగ నిర్ణయించనవసరములేదు.

6. సాందీపుడగు శిష్యుడు -- తమ తరుణోపాయమునకు తెలుసుకున్న అచల పరిపూర్ణ ప్రబోధ ధీమంతుల వారికి లక్షణయుతముగా బోధించి స్వార్ధత్యాగులై ఇహమందు పరమందు భ్రాంతి రహిత స్థితిని పొందియున్నారు.

7. శ్రీకృష్ణ భగవానుడు -- అర్జునుడు = యీ గురుశిష్యులు ప్రాపంచిక పారమార్ధికములయందు చేసినట్టి పద్ధతే గురు శష్యులు శ్రద్ధగా గమనించవలసియున్నది. సూక్ష్మ ప్రజ్ఞగలిగి నట్టి అర్జునుని కనుగొని అతని సారధ్యమునకు ఒప్పుకొని జన్మభీతి కలిగించి భ్రాంతి రహిత స్థితిని ప్రబోధించి అతని ద్వారా దుష్టశిక్షణ శిష్టరక్షణ పరిపాలన గావించినాడు.

8. అర్జునుడగు శిష్యుడు --- తన కర్తృత్వమనే విషయము అనగా వ్యష్టి లక్షణము విడచి గురువాజ్ఞానుసారము ప్రవర్తించినాడు. వారునడచుకొని నిర్ణయించిన పద్ధతే ధర్మగ్రంధముల రూపమున ప్రచారము చేయుచున్నారు గనుక అచల పరిపూర్ణప్రబోధకులగు గురుశిష్యులు ( శ్రీకృష్ణార్జునులు ) ప్రపంచమునకు చేయునట్టి మేలు తిలకించి ఆరీతిగనే నడచుకోవలయునని గురుశిష్యుల కర్తవ్యమును గూర్చి యిహ పరంబుల సమకూర్చి పాఠము చేసేది.

## పశువులు - మానవులు - తురీయులు- దేవతలు

జాగ్రత స్వప్న సుషుప్తి అనే అవస్థా త్రయములు అంతరేంద్రియ, జ్ఞానేంద్రియ, విషయేంద్రియ, కర్మేంద్రియ, ప్రాణాదులగు 25 యింద్రియ వ్యాపారములు. ఆహార నిద్రాభయ మైధునాదులు మానవులకున్నూ మిగతా జీవరాసుల కున్నూ సమానమే. తురీయావస్త మాత్రము ఒక్క మానవులకే పొందుట సాధ్యము కనుక అట్టి తురీయావస్థ యందు స్వస్వరూప సంధానము చేయుటకు ప్రయత్నించువారే మానవ నామమునకు అర్హులు. మానవులు అట్టి ప్రయత్నము చేయనిచో మానవ పశువు లనబడుదురే కాని మానవు దనబడుటకు అర్హతలేదు.

తురీయమనగా స్వస్వరూప సంధానము చేయు అవస్థా విశేషము. యీ అవస్థయందు హంస సహస్రారము నందే వుండును. యట్టి స్వస్వరూప సంధానమునందు దృఢ అభ్యాసము కలిగిన వారలు తురీయులనంబడుదురు. అట్టి స్వస్వరూప సంధానమగు మోక్ష స్వరూపము చేకూరగలదనే ఆశచే మంత్రోపాసన భక్తి, మతాభిమానము, యోగాభ్యాసము తత్వవిచారణ అనుసాధనములందు ప్రయత్నించుచున్నారుకాని అట్టి సాధనల వల్ల స్వస్వరూప స్థితి చేకూరదు. యేల ననగా అహంకారమును పురస్కరించుకొని చేయు మంత్రోపాసన యున్నూ, చిత్తమును పురస్కరించుకొని చేయునది భక్తి యును, బుద్ధి పురస్కరించుకొని చేయునది మతవాదమున్నూ, వాయు స్వరూపమగు మనస్సును పురస్కరించుకొని చేయు తత్వవిచారణ సాంఖ్య విచారణయున్నూ అయివున్నవి. అందుచే యీ సాధకులందరూ అంతరేంద్రియ వ్యాపారములు మీరినవారలు కాజాలరు.

ఇంద్రియాతీతమగు స్థిత్యానుభవము యింద్రియములచే చేయబడు సాధనలవల్ల యెన్నటికినీ కలుగ జాలదు. తురీయ స్థితియందు యే స్వరూపానుభవము గలిగినదో ఆయనుభవము చేతనే జనన మరణ రహితము కాగలదని నమ్మకుండా కేవలము పరిపూర్ణ బోధ వల్లనే జనన మరణ రహితము కాగలదని నమ్మి అందుకైకృషి చేయు వారు మానవులయందు దేవతలు అనబడుదురు. వారే దైవాంశ సంభూతులు. సూరి జనులు పరిపూర్ణబోధకు అధికారులు. పైన ఉదహరించిన సాధనలో ఆత్మ సిద్ధులు గాని, మహిమలు గాని మహత్తులుగాని సంపాదించి ధనము కొరకు దుర్వినియోగము చేయువారు మానవులలో రాక్షసులనంబడుదురు. అట్టివారు హిరణ్యకస్య, పరాశరు, శిశుపాలుడు వగైరా.

| | | |
|---|---|---|
| జగత్తు :- | జ = జన్మించేది | గ = గతించేది జగత్తు. |
| భాగవతము :- | భ = భక్తి గ = జ్ఞానము | వ = వైరాగ్యము |
| | త = తత్వవిచారణ | ము = ముముక్షత్వము |

## అణవదీక్ష - శాంభవీ దీక్ష - శాక్తదీక్ష

1. అణవదీక్ష యనగా గురువు చెప్పిన ప్రకారము యమ నియమములతో కూడి ఆసనము। అనుష్టానములు శ్రద్ధా భక్తులు గలిగి సలుపుట.
2. శాంభవీ దీక్ష యనగా సుఖ స్వరూపమగు పురుషోత్తమ స్వరూపమందుండుట.
3. శాక్త దీక్ష యనగా గురుస్వరూపమగు పురుషోత్తమ స్వరూపము మీరి పరిపూర్ణ పరబ్రహ్మ నిశ్చయమందుండుట.

### షడ్భూతములు

అగ్ని - సూక్ష్మాంశము వాక్కు పృధివి - సూక్ష్మాంశము మనస్సు
జలము- సూక్ష్మాంశము ప్రాణము ఈ మూడు కలసి త్రివృత్కరణి

1. వాక్కు శబ్ద స్వరూపము గనుక వాక్కు ఆకాశభూతము.
2. ప్రాణము వాయు స్వరూపము గనుక ప్రాణము వాయు భూతము.
3. మనస్సు సమిష్టి అంత:కరణ గనుక మనస్సు ఆత్మ స్వరూపము యివి షడ్భూతములు.
   అగ్నియొక్క సూక్ష్మాంశము వాక్కు । స్థూలాంశము ఎముకలు మధ్యమాంశము మజ్జ. జలము యొక్క సూక్ష్మాంశము ప్రాణము । స్థూలాంశము మూత్రము । మధ్యమాంశము రక్తము. పృధివి యొక్క సూక్ష్మాంశము మనస్సు । స్థూలాంశము మలము । మధ్యమాంశము మాంసము.

### యోని సంభవులు - అయోని సంభవులు

యోనిసంభవులు :- నీవు పుట్టుటకు అనగా నీ రాకకు కారణము యేది అని అడిగితే " నేను పుట్టుటకు కారణం నా తల్లి, తండ్రి అని చెప్పే వారు యోని సంభవులు. వారు మామూలు మనుష్యులు గురు పుత్రులు కారు.

అయోనిసంభవులు :- పరిపూర్ణులు. నాకు మూలము నా కర్మ. నా మూలము బ్రంహ్మాండము గాని యేది కాదు. తనకు మూలము బ్రహ్మాండము గాని యేది కాదు. తనకు మూలము బ్రహ్మాండము గనుక అక్కడ నుంచే కాల కర్మ చక్రము నుంచి రాకపోకలు. తన ఆగామి సంచిత ప్రారబ్దములను బట్టి రాక పోకలు జరుగునుగాని తన తల్లి తండ్రి మూలము అని అనుకోరు. వీరు అయోని సంభవులు. తల్లి దండ్రులు కూడా బ్రహ్మ స్వరూపులే. స్వరూపమందు యేకత్వమే గాని వేరుగాదు.

1. ప్రణవ పాదచతుష్టయము ॥ అ । ఉ । మ । అర్ధ మాత్రుకలు.
2. బ్రహ్మ పాదచతుష్టయము ॥
   విరాట్టు, హిరణ్యగర్భ, అవ్యాకృత, పరమాత్మలు.
3. ఆత్మపాదచతుష్టయము ॥ విశ్వ । తైజస । ప్రాజ్ఞ । ప్రత్యగాత్మలు.

### పిండాండము నందు కోశములు

1. అన్నమయకోశము - స్థూలం । దానిధర్మము । అన్నము వల్ల పుట్టి అన్నము వల్ల పెరిగి తిరిగి అన్నరూపమును చెందును.
2. ప్రాణమయ కోశము - ప్రాణేంద్రియములు కర్మేంద్రియములు కూడి ప్రాణమయకోశము. ధర్మము ఆకలి దప్పులు.
3. మనో మయ కోశము - జ్ఞానేంద్రియములు మనస్సు కూడి మనోమయ కోశము. ధర్మము సంకల్ప వికల్పములు.
4. విజ్ఞానమయము - జ్ఞానేంద్రియములు బుద్ధి కూడి విజ్ఞానమయకోశము. ధర్మము. నిశ్చయించుట.
5. ఆనందమయము - ధర్మము ఆనందించుట.

### బ్రహ్మాండము నందు కోశములు

1. పృధివి అన్నమయము. సమస్త జీవులు పృధివి వల్ల పండిన ఓషదుల వల్ల జీవనము చేయుట చేత పృధ్వి అన్నమయమన నొప్పును.

2. జలము ప్రాణమయము ఎట్లనగా జలము సూక్ష్మాంశము ప్రాణము గనుక జలము ప్రాణమయమనొప్పును.
3. అగ్నిమనోమయము ఎట్లనగా అగ్ని సూక్ష్మాంశమైన వాక్కు శబ్దము గనుక శబ్దము జ్ఞానము మనస్సు గనుక అగ్ని మనోమయమని ఒప్పును.
4. వాయువు విజ్ఞానమయము ఎట్లనగా ఆదిశక్తి యం బీజం అని ఆది శక్తి చలించినట్లైతేనేగాని ప్రాణము ఉచ్ఛ్వాస నిశ్వాసలు గలుగవు. మనస్సు సంకల్పము యిక సంకల్పించదు. ప్రథమ చలనము ఆదిశక్తి దగ్గరనుంచే వాయువు విస్తరింపచేసే శక్తి ఆది శక్తి గనుక మనోమయకోశం దగ్గర జ్ఞానశక్తియొక్క జ్ఞానము వృద్ధి పరుచును పరిచితేనేగాని తతిమ్మవి పనిచేయవు.
5. ఆకాశము ఆనందమయకోశము. తన స్వరూపము.

## బ్రహ్మాండమునందు పంచప్రాణములు

1. కాలత్రయముల యందు అనగా వర్షాకాలం శీతాకాలం వేసవి కాలముల యందు సమానముగా ఉండును.
2. వ్యానవాయువు బ్రహ్మాండమంతా ఉండును.
3. ఉదానవాయువు అంతరిక్షమందు శబ్దరూపముగా నుండును.
4. ప్రాణవాయువు సమిష్టిప్రాణం సూర్యుడు.
5. అపానవాయువు పృధివి యందుండును.

## బ్రహ్మాండమందు జాగ్రత స్వప్న సుషుప్తులు

1. జాగ్రత -పరిపూర్ణపరబ్రహ్మ
2. సుషుప్తి -పురుషోత్తమ స్వరూపము
3. స్వప్నము -జీవేశ్వర జగదుత్పత్తి
1. మహాశూన్యం -పరావాక్కు
2. శూన్యం -పశ్యంన్తివాక్కు
3. ఆకాశం -మధ్యమవాక్కు
4. నరులకు -వైఖరీవాక్కు

## నరులకు

1. నాభిదగ్గర సంకల్పము లేకపోవుట। పరావాక్కు।
2. అంత:కరణమునందు సంకల్పము కలుగుట। అనగా గుణము కలుగుట। పశ్యంతివాక్కు।
3. కంఠగతమగుట। మధ్యమవాక్కు।
4. నరులయొక్కమాట। వైఖరీ వాక్కు।

## బ్రహ్మాండములో కాలత్రయములు

వర్షాకాలం జాగ్రదావస్థ। శీతాకాలం స్వప్నావస్థ। వేసవికాలం సుషుప్తావస్థ

1. మహాకాశము = శుద్ధాకాశం - అవకాశమిచ్చేది.
2. దహరాకాశం = హిరణ్మయ వర్ణం- బంగారు ఛాయ

3. నిరవయవాకాశం = సంధ్యవేళ
4. సూర్యాకాశం = ప్రకాశం
5. తత్వకాశం - రాత్రి చీకటి.

1. స్థూలము 2.సూక్ష్మము 3. కారణము 4. మహాకారణము నాలుగు శరీరములు స్థూలమునకు

2. 1. విశ్వ 2. తైజస 3. ప్రాజ్ఞ 4. ప్రత్యగాత్మ 4 గురు అభిమానములు సూక్ష్మమునకు

3. 1.జాగ్రత 2. స్వప్నము 3. సుషుప్తి 4. తురీయము కారణశరీరమునకు నాలుగు అవస్థలు.

4. బాల్య యవ్వన కౌమార వృద్ధాప్యములు స్థూలమునకు.

## స్వయం ప్రకాశ పరబ్రహ్మ నిర్ణయము

తెలియజేయుట తెలుసుకొనుట అనే పద్ధతి లేక ప్రకాశ అప్రకాశమనే పద్ధతి గాక స్వయం ప్రకాశముగా వుండుట.

## పరమేశ్వరుని తను చతుష్టయము మహాకారణ శరీరము

మహాకాశమగు సమిష్టి అంత: కరణము పరమేశ్వరుని హిరణ్మయ కోశము. దాని అభిమానదేవత అక్షరపురుషుడు. ఎట్లనగా జీవేశ్వర జగత్తులయము పొందిన తాను చలించక యుండువాడు గనుక అక్షరపురుడని చెప్పబడును.

## కారణ శరీరము

ఆనందమయ కోశము పరమేశ్వరుని కారణ శరీరము దీని యభిమానియగు పరమేశ్వరునికి అంతర్యామి యని పేరు. మరియు అవ్యాకృతుడని చెప్పబడును. ఎట్లనగా సకల జీవులకు కర్మానుసారముగా ఫలముల నిచ్చుట వలన అంతర్యామి యనిపేరు.

## సూక్ష్మ శరీరము

ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ మను త్రికోశంబులు కూడి పరమేశ్వరుని సూక్ష్మ శరీరమని చెప్పబడును. దీని అభిమానికి హిరణ్య గర్భుడు అనిపేరు. ఎట్లనగా సకల సూక్ష్మశరీరములయందు సూత్రాత్మయగు ప్రాణుండు నేను అని అభిమానించుటవల్ల హిరణ్యగర్భుడనిపేరు.

## స్థూల శరీరము

స్థూల శరీర రూపమగు అన్నమయ కోశ అభిమాని యగు పరమేశ్వరుని విరాట్టు అనిపేరు ఎట్లనగా సూక్ష్మశరీర అభిమానము ధరించుటవలన వైశ్వానరుడనియు ఈ వైశ్వానరుడు అనేక రూపములుగా ప్రతీతి యగుట వలన విరాట్టు అని చెప్పబడును.

## పరమేశ్వరుని భోగ సాధన ముఖంబుల నిర్ణయం

ప్రాణేంద్రియములు 5 కర్మేంద్రియంబులు 5 జ్ఞానేంద్రియంబులు 5 అంత:కరణ చతుష్టయం 4 వీటి అధిష్ఠాన దేవతలలో ప్రాణ పంచకము కేవల అక్షర మాత్రంబులే యగుటచే

మిగతా 14 ముఖంబులు భోగసాధనములని నిర్ణయించి జీవుల కర్మానుభవ లోకంబులు ఈశ్వర ముఖంబులని నిర్ణయించనైనది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. వాదము | = | 1. ఆత్మ | = | 1. అజ్ఞానము. |
| 2. స్వాభావికము | = | 2. ప్రాణము | = | 2. అవివేకము. |
| 3. యతివాదము | = | 3. జీవుడు | = | 3. అభిమానము. |
| 4. స్వేచ్ఛవాదము | = | 4. యింద్రియము | = | 4. రాగద్వేశము |
| 5. ప్రధానవాదము | = | 5. గోళకము | = | 5. శరీరపరిగ్రహము |
| 6. భూతవాదము | = | 6. నరములు | = | 6. కర్మము |
| 7. కర్మవాదము | = | 7. ఆవరణము | = | 7. జన్మము |

## బ్రహ్మవిద్యయందు అవస్థాత్రయ వాదస్వరూపములు త్రివిధములు

1. వ్యవహారము - జాగ్రత వంటిది.
2. ప్రాతిభాసికము - స్వప్నము వంటిది.
3. పారమార్థికము - సుషుప్తి వంటిది.

వ్యవహారమనగా -నానా స్వరూపంబులు ప్రాతిభాసికమనగా - విచారణ యందులేక పోవుట. పారమార్థికమనగా - వృత్తిరహిత స్వరూపము

వ్యవహారమునందు - త్రివిధవాదములు

1. వ్యవహారవాదము 2. పరిణామ వాదము 3. స్వాభావిక వాదము.

1. వ్యవహార వాదమనగా. బంగారము నగలైనట్లు బ్రహ్మము నిమిత్తోపాదాన కారణమని చెప్పుట.
2. పరిణామ వాదమనగా పాలు పెరుగైనట్లు బ్రహ్మము జగత్తు అయినదని చెప్పుట.
3. స్వాభావిక వాదము -విత్తనము వృక్షమైనట్లు.

## చతుర్విధ దీక్షలు

1. నిశ్చల సమయ దీక్ష
2. నిరామయ నిర్వాణ దీక్ష
3. అద్వయామల దీక్ష
4. నిరంజన తూష్ణీభూత పరిపూర్ణదీక్ష

1. అఖండ నిర్దేహ విలీనము
2. అనుపమాన సర్వలయము
3. అద్వితీయ పరిపూర్ణస్థితి.
4. జ్ఞానరహిత తూష్ణీభూత సంగస్థితి

## జీవేశ్వర జగదుత్పత్తి

వ్యష్టి సమిష్టి సూక్ష్మ శరీరములు అపంచీకృత జన్యములు. ఎట్లనగా పరమేశ్వరోపాదులగు నీ

పంచీకృత పంచభూతముల సమిష్టి సాత్వికాంశమున మహాతత్వ మధి దేవతగల అత:కరణము పుట్టెను. వృత్తిభేదముచే మనస్సు బుద్ధి చిత్తము అహంకారము సమిష్టి రాజసాంశము వలన పంచ అధిదేవతలతో ప్రాణేంద్రియము పుట్టెను.

వ్యష్టి సాత్వికాంశముచే అధిదేవతాయుక్త జ్ఞానేంద్రియములు కలిగెను.

### పంచభూతముల కర్మలు కల్పితాంశములు

1. అవకాశమిచ్చుటయే కర్మము. కర్మమే కల్పితాంశము కల్పితాంశమే సవికల్పము
2. చేర్చుట కర్మము. కర్మమే । కల్పితాంశమే సవికల్పము.
3. కాల్చుట కర్మము । కల్పితాంశము । సవికల్పము.
4. పదును చేయుటయే కర్మము । కల్పితాంశము । సవికల్పము.
5. ధరించుటయే కర్మము । కల్పితాంశము । సవికల్పము.

### జాగ్రదవస్థయందు మూడు విధములు

1. వ్యవహారవాదము 2. స్వాభావికవాదము 3. పరిణామవాదము

### స్వప్నావస్థయందు 3 వాదములు

1. ప్రతిభాసికవాదము 2. ప్రతిబింబ వాదము 3. భ్రాంతి వాదము

### సుషుప్తావస్థను గూర్చి 5 విధముల వాదములు

1. తుచ్ఛవాదము 2. వివర్త వాదము 3. అవిచ్ఛిన్నవాదము 4. బ్రహ్మవాదము 5. అజాత వాదము.

భూతములకు మూలము । భూతాకాశము.

తన్మాత్రలకు మూలము । సూర్యాకాశము.

పంచశక్తులకు మూలము । నిరవయవాకాశము.

పంచబీజములకు మూలము । దహరాకాశము.

మహాకాశమే బ్రహ్మ । దహరాకాశమేఅవ్యక్తము. నిరవయవాకాశమే మహత్తు। సూర్యాకాశమే మహదహంకారము. భూతాకాశమే తన్మాత్రలు॥

పరమాత్మ । ఈశ్వరుడు । ఈశ్వరుని కారణ శరీరము మాయ.

అవ్యాకృతుడు । రుద్రుడు । అవ్యాకృతమాయ.

హిరణ్యగర్భుడు । విష్ణువు । జీవుని కారణశరీరము

గుణసామ్యం । బ్రహ్మ - మాయ .

పంచభూతముల ధర్మములు - ముఖ్యాంశములు.

1. ఆకాశము బయలైయుండుటయే ధర్మము । ధర్మమే ముఖ్యాంశము. ముఖ్యాంశమే నిర్వికల్పము.
2. వాయువు చలించుట ధర్మము. ధర్మమే ముఖ్యాంశము. ముఖ్యాంశమే నిర్వికల్పము.
3. అగ్ని వెలుగుట ధర్మము । ధర్మమే ముఖ్యాంశము. ముఖ్యాంశమే నిర్వికల్పము.
4. జలము కల్పడము ధర్మము । ధర్మమే ముఖ్యాంశము. ముఖ్యాంశమే నిర్వికల్పము.
5. పృధిస్నేహించడము ధర్మము । ధర్మమే ముఖ్యాంశము. ముఖ్యాంశమే నిర్వికల్పము.

-0-

# 9. అహంకార రహిత నిర్ణయము

"అహం పదార్ధరహిత:" అని నిత్యము చెప్పుచుందుము అహంకారమనగానేమి?

"కొట్టిన కొట్టదు కోరిన సన్మార్గుండు, తన్నిన తన్నదు తత్వవేత్త" యనియు.

"తిట్టిన తిట్టును తిరిగి దుర్మార్గుడు, తిట్టిన దీవించు నుత్తముండు, తిట్టన నవ్వును దేవతా వర్యుండు" అనియు పలుకుట అహంవర్తించుట అహంకారపద్దతికాదు. యిదిమానవుల పశువులనుగా చేయును మానవ లోక కల్యాణకరముకాదు.

ఆకాశపంచకమగు అంతరేంద్రియపంచకము నందు అహంకారముగా అధ్యాత్మకు అభిమానమగు ఆది భౌతికపద్ధతి గలదు. దీనికి రుద్రుడధిదేవత. 84ల॥ ఉపాదులందూ స్థావరములందు గాక జంగమములందుగల అహంకారము ఏకము. దానికి గల అభిమానము, అధిదేవతయును రుద్రుడుగూడానేకమే. ఎట్లన విశ్వాభిమాని యగు పరమేశ్వరుడు తనచేసృష్టింపబడిన జీవోపాదుల కర్మ పద్ధతిని 14ముఖములద్వారా తెలియుచున్నది. చతుర్దశేంద్రియాధిష్టాన దేవతలే ఈముఖములు. స్తితియందు ఏయింద్రియము ఏ కర్మ యొనర్చునో దాని ఫలా ఫలంబులు ఆయింద్రియాధిష్టాన దేవత వలన పరమేశ్వరుడు గ్రహించి వానికి తగిన ఫలములనిచ్చును. గనుకనే **గీ॥ " అంతరంగమందు అపరాధములు చేసి మంచివానివలెనె మనుజుడుండు, యితరులెరుగకుంటె ఈశ్వరుడెరుగడా విశ్వదాభిరామ వినురవేమ.**

అన్నిజీవులయందు గల యింద్రియాధిష్టానదేవతలు ఏకమేకనుక అందరి యందు ఏకేంద్రియమే కాని భిన్నత్వములేదు. అందువలన అహంకారరూపమగు ఆధ్యాత్మ దాని ఆది భౌతికమగు అభిమానము పరమేశ్వర సృష్టియందు సృష్టిపబడినవి కాని ఇతర పద్ధతుల వలన ఉపాది చెందినట్లు నిర్ణయంలేదు.

**జీవనిర్ణయపద్ధతి యెట్లనగా:**

సీ॥"పృధివి జీవులనెల్ల క్షుధ తృష్ణలును రెండు ప్రాణధర్మములని తెలియబడెను." జననమరణములు దేహధర్మములు ఆకలి దప్పులు ప్రాణధర్మములు శోకమోహములు మనోధర్మములు గా యున్నందునజనన మరణములు పరమేశ్వర ఆధీనములని వాటిని విడచి, ప్రాణధారంబులగు ఆకలి దప్పు లనివారణార్ధం అభిమానం కల్గి మనస్సు సంకల్ప వికల్పంబులుచెందుచుండును. ఎట్లనగా :-

సీ॥ కోరుట కామంబు, కోరిక యర్ధంబు కొనసాగకుండిన క్రోధమగును ..." అగునట్లు కామక్రోధాదుల చెందును.

జ్ఞాని అహంకారము విడిచి యుండవలెనని కామక్రోధాదుల విడచి అహంకార రహితమని అని మొదలు. కాని అది జీవాభిమాన పద్ధతిగాని అహంకార రహిత పద్ధతి గాదు. ఎట్లనగా అధ్యాత్మ రూపమగు అహంకారము, ఆది భౌతిక మగు అభిమానము, ఆది దైవికమగు రుద్రుడు పరమేశ్వర నిర్మితములు. కనుక పరమేశ్వర రహిత విధానమునందు అహంకార రహితముగలదు గాని, జీవస్వరూప అహంకార పరిణామ పద్ధతి యగు కామ క్రోధాదుల విడచినంత మాత్రమున సమూలరూప అహంకార రహితము కాదు. వానిని వదిలినంతమాత్రాన ఏలాటి ప్రయోజనము

లేదు. ఎందుకనగా పరమేశ్వరోపాధి అహంకారము స్వభావంగానే ఉండినది. గనుక వానికి మూలమగు పరమేశ్వర రహితము నందే దాని రహితము. కనుక అహంకార రహిత విధానము సద్గురువుల వలన తెలియవలెను.

-0-

## 10. ఉపదేశ నిర్ణయం

**శ్లో॥ శాస్త్రజ్ఞానం బహుక్లేశం। బుద్ధిశ్చలన కారణమ్**
**ఉపదేశాద్వరేద్బుధ్వా। రమతేసర్వకర్మసు॥** ... కనుక ఉపదేశము అవసరం

ఉపదేశమనగా ఎట్టిది? మానవలోకము నకు ఫలమేమి?

ఉపదేశముపొందినవాని పద్ధతి ఎట్లుండును?

ఉప + దేశం = సమీపమునగల దేశము లేక క్రొత్తదేశము. ఈక్రొత్తదేశమెందుకన, తానున్నదేశము దు:ఖస్వరూపము

**షడూర్మల లక్షణము**

**సీ॥ పృధివి జీవులకెల్ల క్షుధ తృష్ణలును రెండు ప్రాణ ధర్మములని పలుకబడెను।**
**శోక మోహంబులు శోధింపగా,మహోధర్మములని వాటి దలుపబడెను।**
**జనన మరణంబులు జడరూప మైనట్టి దేహధర్మములని దెలియబడెను.**
**యివి షడూర్మలటంచు వివిధ మార్గంబుల వివరించి వీటిని విడిచి నిన్ను**

**గీ॥ సద్గురూత్తంబు గాగన్నసజ్జనుండు। నిష్కళి బ్రహ్మయ్యుందు నిగమ వినుత॥ ॥రమ్య॥**

తా॥ సకల జీవులకు, క్షుద, తృష్ణలు ప్రాణధర్మములు,
శోక మోహములు మనోధర్మములు,
జనన మరణములు దేహధర్మములు,
ఇవి షడూర్మలని విచారించి, విడిచిపెట్టి గురు ముఖమునపరమాత్మనువెరుగవలెను.

ఇందు శరీరధర్మములగు జన్మమరణములులేకుండా చేయుతలంపుతో వాత పిత్త శ్లేష్మములనే రోగములు కనిపెట్టి, వానిని నశింపచేయుటకు ఔషధములు కాయ కల్పంబులతో ప్రయోజనము కలుగకపోవుటగమనించి దానిని వదలుకొనిరి.

ప్రాణధర్మమునకవసరమగు ఆకలి దప్పులనివారణకు మనో సంకల్పములధికంగా నుండునని, యదృచ్ఛాలాభసంతుష్టి గల్గి దొరికినదిమాత్రమే తిని తృప్తిచెందెదమని నిశ్చయించిరి. కాని ఆనిశ్చయం కూడా భిన్నము కల్గెను. ఎట్లనగా ఆకలి దప్పుల నిర్ణయమునకు ఆశ్రయ స్థానమగు కడుపులో పరిమిత స్థానమేకలదు. ఎక్కువతిందామన్నావీలులేదు. తినకుండా ఆలస్యము అయిన ఎడల ప్రాణము తల్లడిల్లి అల్లరిచేయును. కనుక ఏమహాత్ములైనను ఆకలిదప్పులకు లొంగవలసినదే..

మనో ధర్మములగు సంకల్పాదులు లేకుండా చేయుటకు మత్తుపదార్థములు అహోరాత్రములు సేవింతురు.

**శ్లో॥ శుకం, కకం, బకంచైవ, హనుమానేశ్చ, రావణ, కర్ణంచ కుంభకర్ణంచ సప్తైతేజోసలక్షణం॥**

చిలుకపల్కులు, కాకుల కూతలు, కొంగజపములు, భక్తి పద్ధతులు, రాక్షస కృత్యములు దానకర్ణునివంటి డంబాచార వాక్యములు, తుదకు కుంభకర్ణునికి వలే గాఢనిద్ర యందుండుచు యున్నను మత్తుదిగగానే మనోసంకల్పములు కలుగును. కనుక వీనిజయింపరాదు. ఎందుకనగా ప్రాణమనోశరీర ధర్మంబులుగల దేశము దు:ఖస్వరూపమని నిర్ణయించి ఆనందదాయకమగు క్రొత్త దేశము, గురునియొక్క సమీపమందున్న దని శిష్యదుపదేశముపొందును. అట్టి శిష్యపద్ధతి ఎట్లుందునగా:- షడూర్ముల దు:ఖంబులు శిష్యుని కుండరాదు. కనుక వీనికి శాస్త్రాదులు నానా పద్ధతులు నిర్ణయించినారు.

ప్రస్తుతం:- సీతాదేవి ఆంజనేయుని కుపదేశించిన సీతారామాంజనేయం, వశిష్టుడు రామచంద్రుని కుపదేశించినజ్ఞానవాశిష్టం, ఈశ్వరుడు పార్వతి కుపదేశించిన గురుగీత, శ్రీ కృష్ణుడర్జునునికుపదేశించిన భగవద్గీతా ప్రచారమునందున్నవి.

ఉపదేశపద్ధతి వలన అంత:కరణ వృత్తి ఎంతవరకు మారినదీ, బ్రహ్మానందమెంతవరకు అనుభవించినారో తెల్సిన ఎడల ఉపదేశఫలము నిర్ణయంకాగలదు.

సీతాదేవి ఉపదేవించిన వాక్యము "తారకంబు మనశ్శుద్ధికారకంబు, సాంఖ్యమాత్మవిచారకంబు, అనుభవజ్ఞానమమనస్కమట్లు గాక, ఆద్యమెరిగింతు మొదలు నీవవధరింపు " అనితెలుపగా ఆంజనేయునికి కల్గిన శంక ఏమన " ఇది ఇది యనాత్మనేగాని నిది బ్రహ్మమునేనటంచు యెరుగునపుడు, నెమ్మదికలదో లేదో ఇదివిదితంబుగ దెల్పవే శ్రీరామ." అనిన్ని సీ॥ మనకు కల్గిన బుద్ధియును, దశేంద్రియములు, ప్రాణాదులును జతపడినశించు....." సంసారమంతయు

అచ్చుముగగూడా. మనసు ఉన్నదంటే " తనరన్నెమ్మది అంతయున్ బొలియగా తత్వాత్ముడై యుండినన్ పునరుధానముగల్గ దాతనికి...."

సీతాదేవి సమాధానం: "యిదియిదియునాత్మనేగానిది బ్రహ్మము నేనటంచు యెర్గునెజడమై కదలినమదియిటు లామదిగదిసితెలియునతడే స్వప్రకాశాత్ముడగున్ " కాని ఈసమాధానంలో తృప్తి గాలేదు. ఏలనన అది వరలో సంసారమంతయు మనస్సుదేఅయినపుడు మనస్సు జడము ఆత్మయే గుర్తెరుగుననెను. కనుక సంసారము ఆత్మకే అని చెప్పవలసి యున్నది."అంటే ఆత్మ చైతన్యముతో సంయోగమైన మనస్సు అందుకేమో! అట్లా అంటే సంసారము రెంటి సంయోగంలో కల్గెనుకనుక రెండుపోవలెను గాని అందొకమనసుపోతే సంసారము నశించునని చెప్పరాదు.

"ఇంద్రియమనంబులటు చలించనేని నేచలించితినంచునీవెరుగ బోకు నిశ్చలుడనంచు తెలియుము నిన్నుగాంచి యనియు అతినిశ్చలంబులగునంతమీద" (అంటే లేనే లేననకుమీ) " ఆత్మతేజంబు వీక్షించునతని మానసేంద్రియములు చేష్టలనెల్ల విడచి, యొదిగి, చెదరకకదలిక యూరకుండు, శింగముగన్నగజములభంగి అనఘా॥ అనగా సర్వము జడమగునని ప్రబోధించగా ఆంజనేయుల తృప్తి అనగా ఫలానుభవమేమన

**శ్లో॥ దేహబుధ్యాత్తుదాసోహం, జీవబుధ్యాత్త్వదంశక:**
**ఆత్మబుధ్యాత్త్వమేవాహం, యితిమేనిశ్చితామతా:॥**

అనునిశ్చయముగల్గెను. అనగా ఏదనుకుంటే అదిఅగుచున్నాడు కనుక దు:ఖప్రదేశమగు తనదేశమందె యుండెనుగాని సద్గురుని అనుగ్రహమగు శాశ్వతానందప్రదమగు మార్పులేని ప్రదేశమునందు ( ఉపదేశము ) లేదుకనుక శీతారామాంజనేయ మందలి ఉపదేశము తనదేశమేకాని యుపదేశముగాదు. ఈబోధవిధానం చూడగా సాహేబు **"హైతో అమీర్ నహీతో ఫకీర్ మరేతో ఫీక్"** అన్నట్లు ఉన్నది.

**జ్ఞాన వశిష్ఠోపదేశము :-**

శ్రీరామచంద్రునికి వైరాగ్యముకల్గి అన్నపానాదుల మానెను. దశరధుడు వశిష్టుని రావించి పరమాత్మ నిర్ణయం తెలియచెప్పించెను. అదేవైరాగ్యాది నిర్వాణ ప్రకరణము వరకుగల ఆరుప్రకరణములు గల జ్ఞానవాశిష్టము. శ్రీ రామచంద్రునికామీద గల్గిన నిశ్చయమేమనగా కర్మపరిణామము నందు అనగా, సంసారమునందు గల్గిన చిక్కులను తట్టుకోలేక సరయూ నదిలోపడి చావవలసినగతి కల్గించినది.

సీతారామాంజనేయ ఉపదేశమువలన ఆంజనేయుడు పరతంత్రుడిగాఉండిపోయినట్లే, జ్ఞానవాశిష్ట ప్రబోధవలన శ్రీరామచంద్రునికిన్ని పరతంత్రత వదలలేదు. స్వతంత్రుడని చెప్పరాదు. గురువునకు రాని విద్య శిష్యునికెట్లు చెప్పును. రాముడే అస్వతంత్రుడైతే శిష్యుడైన ఆంజనేయుని కెట్లు భ్రాంతిరహితమగును? ఇరువురు సమానప్రతిపత్తియే.

గురుగీత:- పార్వతి ప్రశ్న:-

> **"కేన మార్గేణ భోస్వామిన్ దేహి బ్రహ్మ మయోభవేత్?"**
> **తత్కృపాం కురుమే స్వామిన్ నమామి చరణౌతవ॥**

ఈశ్వరుని జవాబు:-

> **"పిండే ముక్తా: పదేముక్తా, రూపేముక్తా వరాననే,**
> **రూపాతీతేచయే ముక్తా స్తేముక్తా నాత్ర సంశయ:॥**

అనగా, కుండలినీ శక్తి యందును, హంసస్వరూపమునందును, ఆపోజ్యోతి స్వరూపము నందును కళాతీతమైన పరిపూర్ణ మందును ముక్తులగువారెవరో వారే ముక్తులు. ఎట్లనగా సముద్రమునందునీరును, పాలయందు పాలును, ఘటాకాశము, మహాకాశము నందును చేరినట్లు ఆత్మ పరమాత్మనందు చేరును. గురుగీత వలన పార్వతికి కల్గిన ఫలమేమనగా:- విశ్వాభిమానియగు పరమేశ్వరుడు ఎన్ని జన్మములందు ఏఏరూపముగావున్నను పార్వతి ఆరూపములందు భార్యగా యుండి, పురుషుని ప్రకృతి విడువనట్లు వారి చరిత్ర తెలుపు చున్నది.

**భగవద్గీత:-** మానవపద్ధతియందలి అనర్ధకముల వేదశాస్త్రముల యందలి సత్యా సత్యములు తెల్పి దైవాంశ విధానము తెలియచేయగా అర్జునకు గల్గిన మనోనిశ్చయమేమనగా

> **భ॥ గీ॥ నష్టోమోహః స్మృతిర్లబ్ధ్వా త్వత్ప్రసాదాన్మయాఽచ్యుత**
> **స్మితోఽస్మిగత సన్దేహః కరిష్యే వచనంతవ॥**

అనిశ్రీకృష్ణుని ఆజ్ఞానుసారముగా లోకకల్యాణ కరమగునట్లు వర్తించెను.

# 11. క్షేత్ర క్షేత్రజ్ఞరహిత నిర్ణయము

క్షేత్రమనగా సకలావయములచేత తెలియబడుశరీరము. దానిని తెలిసికొనువాడు (అనగా నాముక్కు, నాకన్ను అని) క్షేత్రజ్ఞుడు. నాఇల్లు క్షేత్రము అందు నివాసముగా నున్ననేను క్షేత్రజ్ఞుడని గురువులు ప్రబోధచేయుచున్నారు. ఇది మతిహీనుల ప్రబోధ. ఏలననగా కొంతవరకు నేనుఇంట్లో నుండి ఇల్లు విడిచి ఇతరచోట్ల సంచరించుచున్నాను. అప్పుడు యితరచోట్లు క్షేత్రమనుకొనవలెనా? లేక ఇల్లు క్షేత్ర మనుకొన వలెనా? కనుక క్షేత్రమును విడిచి యుండేవిధానము క్షేత్రజ్ఞపద్ధతి గాదు. క్షేత్రజ్ఞనికి క్షేత్రము విడిచి యుండుట సాధ్యముగాదు. గుడమధురములు విడిచి యుండనట్లే. గనుక

**కందపద్యము॥తనువు నేగానననంటె॥ ఘన సుఖ దు:ఖములు రెండు॥**
**గనపడె నీవై గనుక తనువు నీవొక్కటె॥ వినరా మాటనిట్టి॥ వెర్రినబడకన్॥**

జలముయొక్క సూక్ష్మాంశమగు రసతన్మాత్ర తో ఆకాశముయొక్క శబ్దతన్మాత్ర చేరినందున చిత్తేంద్రియము కలుగుచున్నది దాని అధిదేవతక్షేత్రజ్ఞుడు. ఆధిభౌతికము చింతన. కనుక చిత్తేంద్రియమే క్షేత్రము. దాని అధిదేవత క్షేత్రజ్ఞుడు. సర్వకాల సర్వావస్థలయందు 84లక్షల జీవోపాదుల యందు గలుగునట్టి జా- అంటే జాగ్రత, స్వ- స్వప్నము, సుషు- సుషుప్త, తు-తురీయము.

మరణము. మరణమునందు ఉండు చింతనయే దీనిఅధి భూతము. కనుక కం॥ జగమువలన సంకల్పము, జగమా సంకల్పముననను, జనియించును, వేరగుపడదు జన్మమందిరమగుపడ దెడబాసి నిల్వ వారెండెన్నటికీ బయలును గనినీ వీరెంటెన్నటికీ యికదల్చబోకుము యివి బుట్టుటుళ్ళక్కిమృగ జలమగు పద్దమిధ్యం చెరిగిన మాడ్కి, యారెండెన్నటికీ, బయలును గనినీవీరెంటెన్నటికీ॥

యిదియునుగాక యేకాలమందైనను, ఏదేశమందైనను చిత్తేంద్రియ మగు క్షేత్రమును దానిఆధిభూతము దాని అధిదేవత యగు క్షేత్రజ్ఞుడు విడిచియుండరు. అనగా పుట్టిననుండి చచ్చేవరకు చచ్చిననుండి పుట్టేవరకు సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్య, సార్ష్టిణిత్వములు, సత్యాదిలోకంబులు అదిఇది యననేల జనన మరణ భ్రాంతి రహిత విదేహ కైవల్యము చెందేవరకు క్షేత్రమును విడిచి క్షేత్రజ్ఞుడు గాని ఈరెంటిని విడిచి అభిమానముగాని విడువబోదు.

# 12. శరీరరహిత నిర్ణయము

శరీరరహిత విధానమునందు స్థూలము, సూక్ష్మము, కారణము, మహాకారణము అని 4 శరీరములు నిర్ణయించుచు అందువాటి నిజపద్ధతి ఎట్టులనగా "మరుపన తొలిమేను లుమూడు ఎరుకననాల్గవశరీరము" మరుపు శరీరము ఒకటి ఎరుక శరీరముఒకటి అని శరీరద్వయము నిర్ణయించియున్నారు. ఎట్లనగా **సీ॥ అన్నరసంబుతోనైనా శోణిత శుక్లమయమ్మైన, ఈదేహమన్నమయము పంచప్రాణములు ప్రబలి కర్మేంద్రియ పంచకంబును గూడ ప్రాణమయము, జ్ఞానేంద్రియములైదు, మానసంబొక్కటె కూడయైనది మన: కోశమయము । చెలగి జ్ఞానేంద్రియములు బుద్ధియునుగూడి విజ్ఞానమయము యవిద్యయందు** ***గీ॥ మనసు గలిగిన యానంద మయము లిట్లు పంచ కోశంబులకు సాక్షి పరుడ నీవే ॥ రమ్య॥***

అన్నరసంబుతోనైనది అన్నమయుకోశము, ప్రాణ...... ప్రకృతి పరిణామమగు కోశపంచకమువలన స్థూల సూక్ష్మ కారణశరీరత్రయము ఏకైకరూప ఆవరణముగా నున్నందున ఈమూడుమేనులు మరుపురూపము లనిచెప్పబడును.

ఇక రెండవ శరీరమగు గుర్తెరిగేశరీరము బ్రహ్మస్వరూపమని నిర్ణయించినారు. రెండు విధములుగా యున్నందుననే భగవద్గీత యందుకూడా క్షరాక్షర పురుష స్వరూపమని శ్రీకృష్ణభగవానుడు నిర్ణయించినాడు. కాబట్టి శరీర చతుష్టయము కాదని శరీర ద్వయమేనని తెలియవలెను. శరీర ద్వయ పోషణకు ఆహారమేమనగా, మరుపురూపమగు శరీరమునకు ఆహారము ఏమనగా అగ్నియందు పేల్చబడిన ధాన్యరూపమగు అన్నము; గడ్డి మొదలగునవి. చలనరూపమగు ప్రాణ ఆహుతి ఆహారము.

బ్రహ్మ స్వరూపమగు గుర్తెరిగే శరీరపోషణకు ఆహారమేమనగా సంకల్ప వికల్పరూపమగు మనస్సు ఉదాన ప్రాణరూపమగు ప్రాణము, విషయా విషయ స్వరూపమగు వాక్కు, అనగా త్రికరణంబులే పరమాత్మయగు గుర్తెరిగే శరీరమునకాహారము. శీర్యతి, యితి శరీర: అను న్యాయమున మరుపురూప శరీరమునకు ఆహారమున్నను లేకున్నను వాత పిత్త శ్లేష్మంబులనే రోగంబులచేతను, ముదిమి వల్లను నశించుటయు జీర్ణించుటయు స్వభావమై యున్నది. మరియు గుర్తెరిగే శరీరమునకు ఆహారము త్రికరణంబులగు మనో ప్రాణ వాక్కుల రహితము వలననే గుర్తెరిగే శరీరము నశించునుగాని వేరుమార్గములేదు. శరీరనిర్ణయము యొక్క శరీరములు ఆహారములు తెలుసుకొంటిమి

ఇకఈశరీర ద్వయములో ఏశరీర రహితం గావలెను? మరుపుశరీరము రహితపరచ వలయుననిన అది స్వయంగానే నశించును కనుక అవసరంలేదు. పరమాత్మ స్వరూపమగు గుర్తెరిగే శరీరమున రహిత పరుచుటకే ప్రయత్నం చేయవలెను. దానికారణములగు త్రికరణములు రహితముచేయవలెను. చేస్తేనే పరమాత్మ స్వరూప రహితం కాగలదు. ఈ విధానము గురుమూర్తి ముఖత: తెలియవలెను.

## 13. వైజ్ఞానిక స్వరూప స్వభావములు

**"మత్త: పరతరంనాన్యత్, కించిదస్తి ధనంజయ, మయిసర్వమిదం ప్రోతం, సూత్రేమణిగణాయివ "భ.గీ.**

"యావద్విజ్ఞానసారమిందు ప్రతిష్టితం". జీవిత పరిశోధన గావించిన వారిలో భారతీయులే ప్రధములు. "అధనాబహునైతే వకింజ్ఞాతేన తవార్జున, నిష్టభ్యాహమిదం కృత్స్నమేహంశేనస్థితోజగత్" అనిగ్రహించి అనిత్య ప్రపంచార్ధత మగునిత్యత్వమును సాక్షాత్కరించుమార్గమును భారతీయులు అనుభవము లోనికిదెచ్చిరి. ఆమార్గమునకేవిజ్ఞానమని పేరు. సమగ్రమానవ జీవితమున ఏకత్వమునకై ప్రదర్శింపబడు విధానము లన్నియు విజ్ఞానాంతర్గతములే. పశుజీవితమును నిర్మూలించి, స్వార్ధలక్షణం పోద్రోలి ఏకత్వ సిద్ధినికలిగించి దైవజీవితమును ప్రసాదించుటయే విజ్ఞాన స్వభావము. మహాఋషులొనరించిన వైజ్ఞానిక పరిసోధనా సంపుటియే వేదములు. మానవుని భగవదంశను ప్రకటించునదే జీవితము. భగవద్విలక్షణములతో కూడినదే ప్రపంచము. స్వధర్మానుష్టాననిర్వహణ జీవిత వికాస సాధనము. అర్ధమునందు పరమార్ధమును, వ్యావహారికమునందు ఆధ్యాత్మికమును జూచు సమన్వయదృష్టి భారతీయ విజ్ఞానమునకు ప్రాణము.

భారత జాతీయ సమగ్ర జీవిత స్వరూపమును ప్రజలయందు ప్రబోధింపజాలని హేతువు చేపెక్కు సమాజములు కృతార్థములు కాలేదు. ఆర్యసమాజము యావద్భారత సాంప్రదాయ సమన్వయము చేకూర్చజాలక కొంత భాగము వేదవిహితముకాదని త్రోసివేసెను. దివ్యజ్ఞాన సమాజము ఆంగ్లవిద్యాధికులను కొందరినే ఆకర్షింపగల్గెను.

యావన్మత సాంప్రదాయములకు వేద వేదాంత వైజ్ఞానిక ధర్మదృష్టితో సమన్వయమొనరించి నిర్జీవమైపోయిన విశ్వజీవితమును సజీవమొనరించుటయే ఆదర్శము. మానవుడు పరమేశ్వరాంశ సంభూతుడు. వివిధమతములు, సాంప్రదాయములు, జీవిత విధానములు అన్నియు భగవదంశను సాధించుమార్గములే.

విశ్వవ్యాప్తమగు భగవదైక్యతకు సుప్రతిష్ఠతమొనరిచునదియే విజ్ఞానము. యీవిజ్ఞానవాహిని స్వచ్ఛముగ నున్నంతవరకు, హెచ్చుతగ్గులతో కూడిన విభేదములు, అసూయ, దురాశ, దుస్తంత్రము నిర్వీర్యత, శుష్కవాదము, భయభ్రాంతులు జీవిత రంగమున ప్రవేశంపజాలవు.

పశుత్వమును పారద్రోలి, మానవత్వమును వికసింపచేసి దైవత్వముననుభవములోనికిదేవలెను. యిట్టిదే అనుష్ఠానమతం. బాహ్యవృత్తులయొక్కయు, నాభ్యంతర వృత్తులయొక్కయు సమీకరణరూపమైన వస్తు తత్వావ భోధము వలన గల్గిన జ్ఞానమే విజ్ఞానము.

ఒంటరితనమనగా ఏకత్వము. ఏకత్వమే శుద్ధత; అదేనిర్భయత; తానొక్కడే నుండిన స్వేచ్ఛ; యిర్వురుంటే భయం, " ద్వితీయాద్వై భయం భవతి ".

**శంకరులు:-**

**శ్లో॥ మోక్షసాధన సామగ్ర్యాం, భక్తిదేవగరీయసీ**
**స్వస్వరూపాను సంధానంభక్తి రిత్యభిధీయతే॥**

' నదేవస్సా ్వత్మన: పర: ' ' నామ పంథే 2 పరాపూజా: ' ' ఆత్మైవదేవతాసర్వా: '

-o-

## 14. తీర్థయాత్రలు

మహర్షులు భాహ్యాభ్యంతర తీర్థములకు గల సంబంధమును వ్యక్తము చేయుచునే యుండిరి. బాహ్యకర్మలద్వారా ఆధ్యాత్మిక చింత వృద్ధిఅగును. అర్థకామములగూర్చిన మానవ ప్రవృత్తిని ధర్మబద్ధముగాచేయు నుద్దేశముతోడనే బాహ్యతీర్థ కల్పనవిరివిగాచేయబడినది.

మానస తీర్థములు, బాహ్యతీర్థములకంటేమేలు. సత్యము ఇంద్రియనిగ్రహము దానసమతాదులే మానస తీర్థములు.

**"రాగ దోషమలాపహారక్షమంబు మానసంబైనతీర్థంబు"**
**"యమేదం కాశ్యతే సర్వంసాకాశీ పరికీర్త్యతే"**

అంతయు దేనిచే ప్రకాశించునో అదియే కాశీ. ఆప్రకాశింపచేయు శక్తియే చిచ్ఛక్తి. అదే సుషుమ్నానాడి.

వరణ + అసి = వారణాశి.

**"సర్వానింద్రియాకృతాన్ దోషాన్ వారయతితేనవరణాభవత్**
**సర్వానింద్రియాకృతాన్‌సాపాన్ అస్యతితే నాసిర్భవతి".** యింద్రియకృతదోషనివారిణి కనుక వరణ

స్థానము:- భ్రువోర్ఘ్రాణస్యోభయ సంధి: సద్యోర్లోకస్య పదస్యచ సంధిర్భవతి = భ్రూమధ్యస్థానము. ద్యులోక పరలోకముల సంధి కూడా.

వరుణా అసీనదుల సంధిని భ్రూ ఘ్రాణముల సంధిగాభావించి సుషుమ్నానాడి మూలంగా చిచ్ఛక్తిమయుడఅగు రుద్రుని తాపత్రయాత్మకమగు సంసారదు:ఖములు దానికారణమగు ద్రవింపచేయునట్టి వాని నుపాసించినచో ముక్తి పొందును కనుక స్వప్రకాశము, చిచ్ఛక్తిరూపము నగుసుషుమ్నాడియే ఆంతరంగికమగు కాశీతీర్థము.

ఇది సంస్కృత ప్రభావమా? భారతదేశమును ఆత్మీయమగు భౌతిక శరీరమున భావింపబడినదా? ఏదైనను తీర్థనామములు సార్థకములే।

**" ఋషీనాంపునరాద్యానాంహిచమర్థోనుధావతి "**

-o-

సత్యము:- తస్యైతపోదను కర్మేతిప్రతిష్ఠా. వేదా స్సర్వాంగాణి-సత్యమాయితనం" (కేన. ఉ.) తపము = వాంగ్మనోకాయముల సమాధానం. ఇచ్చట సత్యమనగా వాగ్మన: కాయములందు అకౌటిల్యము, అమాయత్వము అని శంకర భాష్యం

ఋతము:- అనగా మనస్సుచేయు యదార్థచింతన
సత్యమన వాక్కు చేయ యదార్థ భాషణ.

సత్యమన యదార్థ భాషణ మాత్రము గాదు. యదార్థ వస్తుచింతన, యదార్థ కర్మాచరణ, సహితయధార్థ భాషణ అట్టి సత్యానుష్ఠానములేని యజ్ఞ దాన తపాధ్యనుష్ఠాతయొక్క ప్రపత్తి అనగా ప్రవర్తన, దంభమాత్రమగు అసుర ప్రవృత్తియని గీతాచార్యులు.

-0-

## 15. తత్వమీమాంస

1. ఈప్రపంచము సత్యమా? లేక యిది కేవలము మనకగోచరమగు యత్కశ్చిత్ సత్పదార్థపు ఛాయయా?

సత్యము:- పరివర్తనము, హానివృద్ధులు,లేక శాశ్వతముగ స్వస్థముగనుండు నదియే సత్యము అనికొందరి నిర్వచనము. ఆపద్ధతిలో ప్రపంచము సత్యము కాదనియే అనవలసివచ్చును. అయితే సద్వస్తువేది?

ప్రపంచము సత్యము కాదనగా నిది కుందేటికొమ్ము గాడిదగ్రుడ్డు వలె కేవలమసత్యమగు కల్పితవస్తువును కాదు. శాశ్వతమునుకాదు. యిది సదసత్తులు కానిది మిధ్య అయితే మనకి ఘోరమైన భ్రమ ఏలకలిగెను? ఏలనిది సత్యముగా తోచుచున్నది. అవిద్యవలన - అవిద్యకు కారణము వీరు చెప్పలేకున్నారు. కనుక అది కారణములేని అనాదివస్తువనిచెప్పి సరిపెట్టుచున్నారు.( శంకర+Bradely)

2. ప్రపంచము మన కళ్ళ ఎదుట కన్పడు చుండ దీనిని మిధ్యయని ప్రల పించుట యున్మాదము. ప్రపంచము వాస్తవము. దృశ్యమానజగత్తు అనిత్యము కావచ్చును. అలీకము కాదు. జగద్వ్యాపారమొక క్రియ. కర్తయుండవలె. ఆకర్తయే దేవుడు. దేవుడీ లోకమును ఏల సృజించెను? దీనిని దుఃఖభాజనమేల చేసెను? సృష్టి అనాది అనియు, దానికి కారణము జీవుల కర్మవిపాకమే నని ఈకర్మ విపాకమునకు కారణము వారి అనాది వాసనలే యని జవాబీయబడెను. కొందరు లీలయే (ఈశ్వరలీల) కారణమన్నారు. కొందరు భగవంతుని యందనంతావకాశములు జగద్రూపంగా వ్యక్తీకరింపబడినవని కొందరు. యీవిధమగు దర్శనము లన్నియు ఈశ్వర వాదమందు పర్యవ సానమొందినవి.

3. జగత్కారణము దానికి బయట లేదు. దానిలోనే ఉన్నది. దానిని తెలిసికొనుటకు వేరొక తత్వ మవసరంలేదు. ప్రకృతియందే (జగత్తునందే) నున్నయొక శక్తి నానావిధ రూపభంగిమలను దాల్పింపచేసినది. ఈశక్తియే Elan vital. మున్ముందు నీటి బురద, పిదప ఎఱ్ఱలు వానపాములు తదుపరి జలగలు జలచరములు గను ఎవాల్వ్ అయినవి. దార్విన్ సాంఖ్యులపరిణామవాదమిట్లే కాని ప్రకృతిని నడిపించుశక్తి (పురుషుడు) దాని అంతస్థితమను శక్తిగాదు. వేరొండుతత్వమే. రామానుజులు జగత్తు నారాయణ శరీరము. దానికి నారాయణుడేప్రాణితము చేయును. యీనారాయణున కును Elan vital కించిత్సామ్యమున్నది.

4. పరిణామ వాదప్రకారం జగద్వ్యాపారము. కాని అదియేల జరుగును అని అడుగుటకు అర్ధంలేదు. అన్ని కార్యములకు కారణముండవలెననుట అయుక్తం. చక్రాకృతిలోతిరుగు సంసారమునకుతుది మొదలు వెదకుట వెర్రి. యీపరివర్తనాదులు సత్యము. దీనికధిష్టానముగ సత్వర్ధములేదు. కారణమనగా లేనివస్తువు పుట్టుట, లేక ఎట్లు పుట్టును. వస్తువు రూపము మారుటయే . యీ మార్పు ఇట్లేల జరుగు చున్నదనుట వెర్రి ప్రశ్నయే. అది దాని స్వభావము. నీ How & why అనుటయుపపత్తి లేదు. అని కొందరు దార్శనికులు.

5. సద్వస్తువును వెదకెదవా? అసలు వస్తువేలేదు అని కొందరూ ప్రపంచమొక ప్రకియ యిందు పదార్ధములు లేవు, the world is a series of events. ఒక పరిస్థితీ ప్రవాహమె. ఖ ఎష్ఘుఅఅ శీట వజవత్ం. స్తితి వస్తువునకుండును గాని వస్తు రహితమైన స్థితి ఏమిటి అందువా? అయితే స్తితిరహితమైన వస్తువు మాత్రమెటులుండును? వస్తువున్నచో ఏదోయొక స్తితి యందుండును గాని ఏస్తితియుగాని తురీయములో నెట్లుండును? కాన వస్తుస్థితియే వస్తువుకన్న వాస్తవమైనది. స్తితి సంచలనమే జగత్తు. ప్రక్రియయే ప్రపంచము. The world is a process ఈ సంచలనమున వస్తువు లేదు. యీప్రక్రియ యందు పదార్ధములేదు. కనుక సద్వస్తువును పెదకుట వెఱ్ఱి. Whitehead మున్నగువారు. కొన్ని బౌద్ధప్రస్థానములవారు, అభినవగుప్తుని స్పందవాదమునకు దీనికి సామ్యమున్నది.

6. జీవితం, ప్రపంచం, అజ్ఞాతములైన కొన్ని మహాశక్తుల సంఘటనా ఫలితం. యీసంఘటన యాదృచ్ఛికం. మనకు తెలియక పూర్వమే బ్రహ్మాండశక్తులు అభిప్రేరితములయ్యెను. ఎటులయ్యెనో విజ్ఞానశాస్త్రము కొంతవరకు చెప్పుచున్నది. వాని అంధ వేగం అకారణము.

ఖగోళ శక్తుల పరస్పరసంఘటనము నుండి భూగోళము. తదుపరి పరిణామములో, జలచర, సరీసృపవనచరవానరములనుండి క్రమముగా మానవుడు. మానవజననమునకు కారణము అర్థములేదు పుట్టగొడుగుల పుట్టుకకు ప్రయోజనములేనట్లే ఈజగత్తుకు అర్థము, ఆదర్శము సాధ్యములేదు. ఉన్నదనివెదకబూనుట వెర్రితనము. H.G. Wells.

7. ఇంద్రియజ్ఞానమునకు జగత్తు సత్యము. ఇదిమిధ్య అని మహత్సత్యమొకటి అతీంద్రియముగా నున్నదని దాని అనుభూతిని అతీంద్రియముగ తాము పొందితిమని యోగులు. అమెరికన్‌విశ్వ విద్యాలయము లోని పరిశోధనలు అతీంద్రియజ్ఞానము (Extra sensory perception) కలదని దృఢ పరచినవి. సంభోగసౌఖ్యము మిధ్య అనుటకు నపుంసకునికధికారము లేదుగదా! ఇంద్రియ జ్ఞానము కాదని త్రోసివేయుట హాస్యాస్పదము. కనుక ఇంద్రియ అతీంద్రియ జగత్తులలో దేనినీ త్రోసిపుచ్చలేము. ఒకటి సగుణ సరూపతత్వము రెండవది నిర్గుణ నిరంజనము. ఈరెంటి సమగ్రసాకల్యమే సంపూర్ణసత్యము. కృత్స్నసత్యం జగత్తుగనూ. జగత్తు కతీతముగను గూడనున్నది. అది ఏకకాలమున అపరివర్తనము, ఆద్యంత రహితము, అక్షుబ్ధము, అస్తబ్ధము నగు శాశ్వతత్వముగా నుండుటయే గాక, పరివర్తనశీలము, నశ్వరమునగు జగత్తుగా గూడానున్నది. ఈసిద్ధాంతమే అరవిందులవలంబించిరి. Also శాక్తదర్శనము. భాస్కరుని సిద్ధాంతము లందు గూడదీనిఛాయలు గాననగును.

సత్యసిద్ధాంతమొక్కటియేయుండునుగాని యన్నియుండజాలవు. యన్నియుండుటకుకారణము:- ప్రపంచము సత్యమా అసత్యమా? అనునదే తత్వశాస్త్రం (metaphysics). ముందు సత్యమననేదో తేలవలెను ఎన్నడు ఏవిధమైనమార్పుచెందనిదే సత్యమన్న శంకరులకు ప్రపంచము సత్యము కాదు అని అనవలసి వచ్చినది. ఈనిర్వచనమంగీకరించని వారికీ చిక్కలేదు, సర్వము యదార్థమన్న రామానుజులుకు జగత్తుమిధ్య అని అనవలసిన అవసరంలేదు. అందుచేదృక్కోణమందు దర్శనము లందు భేదము వచ్చినది.

అనిర్దేశ్యయములగు భావములకు సత్యము శీలము సర్వాంగీకారమగు నిర్వచనమీయ లేము. కనుక నీతిశాస్త్రము, సౌందర్యచర్చ, మున్నగు వానిలో యొకే నిశ్చయం సర్వసమ్మతము కాదు.

అట్లేప్రపంచమునకు కారణమున్నదా? లేదా? అనుప్రశ్న. కారణ మననేమియో ఏకమతము లేదు. కార్యకారణ సంబంధమే మియనుటలోగూడనంతియే. మనదర్శనములలోనే 1. సత్కార్యవాదము 2. పరిణామవాదము 3. వివర్త వాదము అను మూడు వాదములున్నవి.

ఆకాశమును అందుకొనుటకు నిచ్చెనలను పొడిగించినఎట్లు ప్రయోజనములేదో అట్లే మరొకపంథా వెదకవలె.

**" నైషాతర్కేణమతిరా పనేయా "**
**" నమేధయానబహునాశ్రుతేన "**
**" యతోవాచోనివర్తంతే అప్రాప్యమనసా సహ "**

సత్యాన్వేషణలో పెక్కురు తర్కశాస్త్రముకు తమ వివేచనాపటిమను స్వానుభవమును పురస్కరించు

కొని ప్రయత్నించినారు. సత్యోపలబ్ధి చేకొరినదని కొందరు తమ ప్రయత్నములను అపూర్ణ సిద్ధాంతములను లోకమునకు చాటినారు. మరికొందరు సత్యము శశవిషాణమన్నారు. కొందరు మానవబుద్ధికది అతీతము అసాధ్యమన్నారు. తెలిసికొన లేకపోతిమేయని కొందరు తహతహలాడినారు.

**తత్వసిద్ధాంతముల అపూర్ణత సందిగ్ధత చాటుచు ఉమర్‌ఖయాం:-**

చ॥ ఇహపరలోక తర్కముల నెంతో, చలంపడిశాస్త్రులు గురూద్వహులును పెక్కురేగిరి, పదంపడి వారి భవిష్యదర్థ సంగ్రహమును త్రుప్పు పట్టె, సుడిగాలికి బోయె తదీయ బోధనా మహిమయు, దుమ్ముగొట్టు కొని మాసెను వారి సమాధులున్ చెలీ!

ఉ॥ నేనును బాల్యమందధికనిష్ఠమెయిన్ గురుపాదసన్నిధిన్ మానుగ నాలకించితి ప్రమాణములైన పరేంగి తార్థముల్ కాని, నిజాన కెప్పుడును కన్నులు విప్పక బైలు వచ్చితిన్ పూనికవీడి, లోపలికి బోయినవాకిటనే సత్యము శీల॥

పరమసత్యము, విలక్షణము, విపరీతము (unbounded) సాధ్యమట్టిది గనుక సాధనయు నట్టిదేకావలె, మదమత్తేభము బడి పిల్లలను భయపెట్టు వేపబెత్త పూదెబ్బకు లొంగునా? అట్లేరసాయనప్రకృతి, ఖగోళ, భూగర్భ, గణిత, శిల్పాది శాస్త్రవిధానములు తత్వమీమాంసయందు నిరుపయోగములు. యిది తెలియుటయే సోపానము. తర్క వితర్క సిద్ధాంత రాద్ధాంతాల అలజడిలో సత్యదర్శనము కానేరదు. యిది ప్రథమత: వాంఛనీయం. అప్పుడు గాని శాస్త్ర వాసనతిక్రమింపలేము. నారదుడు చివరకు **" సోఽహంభగవో మంత్ర విదేవాస్మినాత్మనిత్ "** అనుస్తితి లోనే వుండిపోయెను. పర్యవ సానము యోగమార్గముననే సాధ్యము. వివేచనలు (Philosophies) అందు సాఫల్యతనొందజాలవు.

**పరమార్థము:-** దేనిని పొందిన తర్వాత తిర్గి యెప్పటికిని దు:ఖస్పర్శ కలుగదో అది నిజమైన పరమార్థము.

క్లేశమునకు మూలమేమి ? జన్మాదులు శ్రుతి:- " సహనైస శరీరస్య సత: ప్రియా ప్రియ యోరసహలిరస్తి " అట్టులని జీవులకీ క్లేశము నైజము ( స్వభావం ) అని అనరాదు, జన్మకు కర్మ, కర్మకు రాగాదులు కారణము. రాగమునకు కారణము రెండవ వస్తువు తోచుటయే

( చూ॥ ) (1) యత్రతత్వ స్యసర్వ మాత్మైవాభూత్త త్కేనకు పశ్యేత్

(2) ద్వితీయాద్వైభయం భవతి.

(3) భయంధ్వితీయాభిని వేశ తస్యాత్

వస్తువు వక్కటే. రెండవ వస్తువుకు వస్తుత్వములేదు, రెండవ వస్తువుతోచుటలోకారణమైన సత్యత్వము కార్యము యొక్క నామరూపకల్పన యొక్క, అసత్యత్వము కలసి మొత్తము నాద్వితీయవస్తువునకు ఉనికి ఏర్పడినది. కారణాను గతమైన భావము సత్యము కార్యానూ గతభావము అజ్ఞానము.

# 16. నాగరికత

మేధాశక్తి, హృదయశక్తుల సమన్వయమున్ననే సర్వతోముఖాభివృద్ధి మనుష్యత్వము ముక్షత్వములు అవినా భావముచెందవలెను.

| | | |
|---|---|---|
| మంత్రయుగము | - యంత్రయుగము | నేడు మొదటివి వెనుకంజవేసినవి |
| విశ్వాస శక్తి | - హేతు శక్తి | తరువాతవి ముందు కురికినవి |
| హృదయ శక్తి | - మేధాశక్తి | |

రామ కృష్ణుడు సూర్యుదు - సూర్యప్రకాశము వలన తేజస్వి అయినవాడు వివేకానందుడు, అతడు హిందూమతమును, వైజ్ఞానిక రాజపథమునకు త్రిప్పెను. యిరుకు పుంతలనుండి తప్పించెను. క్లిష్టమైన వేదాంత విషయములు ప్రజాళియాకళింతకందించెను.

భైరవీబ్రాహ్మణి రామకృష్ణునికి సమస్త తాంత్రిక రహస్యములను వెల్లడించెను, పిమ్మట తోతాపురి అనుగ్రహమున నిర్వికల్పసమాధి గల్గెను.

1. వివేకానందుని సందేశములు:- సర్వధర్మసమన్వయ స్వరూపమే వేదాంతము. మతములన్నియు వివిధమార్గములు.
2. ఆత్మనిత్యశుద్ధము :- అద్వితీయము " నజాయతే నమ్రియతే "
3. మరణమనగా ఒకశరీరమును విడచి మరియొక శరీరమును దాల్చుట.
4. అహంకారము వదలినగాని భగవద్దర్శనము లభించదు. జీవునివ్యక్తిత్వమనునది వట్టి భ్రాంతి.
5. భౌతిక శాస్త్ర్యదష్ట్యా గూడా ఏకత్వమే సిద్ధాంతము.
6. వేదముల పౌరుషేయములు. సర్వేశ్వరుని జేరుమార్గ ప్రకటనమే వేదశాస్త్రముఖ్యోద్దేశము.
7. ప్రార్ధనలుఅను కర్మాచరణ చిత్తశుద్ధికిని, ప్రతిమారాధన ధ్యానమునకును తోడ్పడును. అభివృద్ధిచెందినకొద్దియివి విడువదగును.
8. ధర్మము పూర్వపక్ష సిద్ధాంతములతోడను గ్రంధములతోడను కూడినదిగాదు. సాక్షాత్కారమే ధర్మతత్త్వము. సనాతన ధర్మ తత్వము.

## సనాతన ధర్మసారాంశము

1. ప్రతిజీవియందు దేవత్వము గర్భితము. బాహ్యాంతర ప్రకృతినంతయు నిరోధించి దివ్యత్వము వ్యక్తము చేయుటయే జీవిత పరమ ప్రయోజనము.
2. ఇందుక్కకర్మ, ఉపాసన, భక్తి, యోగ, జ్ఞాన మార్గములలో వకటో అన్నియో ముముక్షువు లవలంభించవలెను.
3. వాదములు, కర్మలు, గ్రంథములు యిందుక్కసహాయకారులేగాని కేవలమప్రధాన వివరములు.
4. సమస్త మత ధర్మపరమ ప్రయోజనము ఒక్కటే. భగవంతునితో లేదా తనయదార్ధ స్వభావముతోను మరల ఐక్యమందుటయే. ఔషధమొక్కటైనా అనుపాన భేదముల వలె సాధనమార్గములనేకములూ. ప్రసంగము, వాదములు, సిద్ధాంతములు యెంతమనోజ్ఞములైనను మతముకానేరవు. మతము, ధర్మము అనగా సాక్షాత్కారము. వినుటయు అంగీకరించుటయు మాత్రమే కాదు. మతమనగా సంస్థితి, ఆత్మ పరివర్తనము, ఏదిపరమ సత్యమో తత్స్వరూపంగా మారిపోవుట. ఇదియే మతము. అదియే సనాతన ధర్మం.

# 17. తలపునకందనిపరిపూర్ణబ్రహ్మము

మానవచైతన్యము సాపేక్షజగత్తున నడయాడుచున్నది. చైతన్యమునకు విషయమగు ప్రతిపదార్థమును జ్ఞాతకును యితరవస్తువులకునుగల సంబంధముతో గూడియేసాపేక్షికముగా ప్రకటమగుచున్నది. పదార్థసత్తా అనగా యునికి యితరపదార్థసాపేక్షికంగా కల్గుచు అదృష్టానే సత్యమైయున్నది, గాని అన్యవస్తు నిరపేక్షికంగా సత్య స్వరూపంగల్గి యుండుటలేదు. విశ్వము ప్రవాహరూపసత్యత్వము మాత్రమే గల్గిదోచుచున్నది. చైతన్యముకూడా సాపేక్షికంగానే చైతన్యముగల దృశ్యమానమగుచున్నది(యితరవస్తు సంబంధముతోగూడియే). తనకు సంబంధపడని, తనలోలేని అనగా తన అవధి లేక సామలోలేని ఏపదార్థమును దానికి ద్యోతకంకాజాలదు.

ఇట్లు సాపేక్షిక ప్రపంచమునకు కట్టువడియున్నను, యీసాపేక్షిక జగత్తు కొక నిరపేక్షక సత్యపదార్థమాధారముండవలెను ధృడనమ్మిక మానవ చైతన్యమునకు కలదు. కనుక యీసాపేక్షిక పంజరమునుండి ఎగిరిపోయి నిరపేక్ష వస్తుస్వరూపము తెలియవలెను ఆశమాత్రము అదివదల లేకున్నది. ఆవస్తువును తెలియునంతవరకు దానికి స్తిమితము చేకూర జాలదు. ఈ relativity కి అనగా యీ సాపేక్షిక త్వమునకు కారణాదులు నిరపేక్షిక త్వమున గ్రహించుటకు ప్రయాసపడును. సాపేక్షికత్వమునతిక్రమించి నిరపేక్షికత్వమున నిలచిన సాపేక్షికముయొక్క స్వభావాదులు గమనించ నుత్సహించును.

నిరపేక్షికపదార్థమే ఆదర్శము. ఈ ఆదర్శము ఆముష్మికశ్రీ లభించినపుడే అది చరితార్థమగును. ఈ నిరపేక్షికము తెలియవలె. ప్రేమించవలె. దానితో ఐక్యంపొందిదానిలోనే దానికొరకే సర్వమున్నట్లు గ్రహించవలె, ఆ " సత్యం, శివం, సుందరం" (truth, beauty, and grander)ను అనుభవించవలె. అనుభావమే దివ్యమగు అసంతుష్టి (divine discontent) దివ్యాన్వేషణమై, వేదాంత శాస్త్రమునకు ప్రవర్తకమాయెను. ఈ అన్వేషణలోనే నీతివంతుడై సకల సుగుణములలవర్చుకొనును. ఈ అన్వేషణలోనే సకల శాస్త్రములు బయలువెడలెను. నిరంతర మార్పులు పొందుచు సాంతమై సాపేక్షికమై నానాత్వమై యున్న యీ విశ్వమునకు కారణమన్వేషించుట యే ఫలితార్థము. ఈ అన్వేషణలోనే అంతకంతకు మానవుడు ఏకత్వమునకు దారితీయగల్గు చున్నాడు. అంత కంతకు పారమార్థికాభివృద్ధి గాంచుచున్నాడు. సాపేక్షిక ఏకత్వము, సాపేక్షిక శాంతి, శాశ్వతత్వముల కనుగొనుచున్నాడు. కానియీ జ్ఞానపిపాస చల్లారుట లేదు. ఆనిరపేక్షిక సత్యమును గాంచినగాని అతనిఅన్వేషణ పరిసమాప్తికాజాలదు. ఆతనికి శాంతి లభించ జాలదు.

యిదియే నిరపేక్షిక సత్యపదార్థమా?:- తొలిమానవునికాలమునుండియు యీసత్యాన్వేషణ మానవుడు చేయుచునేయున్నాడు. నానాభావములు గలుగుచునేయున్నవి. పంచభూతములు శక్తి (Energy) దేశము ( space) కాలము (time) విధి, నిష్కారణ సంఘటనలు (changes) అన్నియు ఒక్కొక్కప్పుడు వక్కక్కటి నిరపేక్షక సత్యపదార్థమే అని భావింపబడెను. పిదప అది నిర్విశేషమగు శుద్ధ సత్ అనిభావింపబడెను. కాని అట్టిపదార్థము వల్ల ఈ విశ్వమెట్లు ఏర్పడెను? కనుక సమిష్టి కర్త లేక సర్వవ్యాపక శుద్ధ చైతన్యము అని భావించ బడెను. కాని ఇది కూడా సంతుష్టి యీయలేకపోయెను.

3. సందిగ్ధావస్థ:- ఏభావముకు సరియగు జవాబు నీయజాలని హేతువుచే సర్వ సత్త కాధారమగు అన్యకారణమే లేదను నిస్పృహ కూడా నొకప్పుడు కొందరికి కలుగజొచ్చినది అందుచే, పరమాణు సిద్ధాంతము బయలుదేరెను. కాని నియమ పూర్వకముగా నడుపబడు విశ్వమునకు ప్రభువు లేనేలేదను వాదము సంతృప్తి కరము కాలేదు.

తిరిగి అన్వేషణ ప్రారంభమాయెను. నానాత్వములోగల ఏక వస్తువును కాక నానాత్వమునకతీతముగా, నానాత్వముకు సమన్వయించి పాలించు నదియై, నానాత్వమునకు బాహ్యాభ్యంతరములకుంటూ, సృష్టిచేయుచు లేక పరిణమించుచూ యుండునది అని భావింపబడెను. కాని కేవల అతీత వస్తువు కాకుండుటచే యిదియు సంతృప్తినీయజాలక పోయెను.

ఎంత అన్వేషించినా సాపేక్షికము మీరజాలకపోవుచుండెను. సాపేక్షిక పదార్థములలోనే ఒకటైపోవుచుండెను. కనుక మానవచైతన్యము సందిగ్ధస్తితి పోవుటలేదు. సాపేక్షికము వలన తృప్తిలేదు. నిరపేక్షికము దొరుకుటలేదు. దానిని గురించిన భావములన్నియు సాపేక్షిక స్వభావమును వీడుటలేదు.

ఈ సంధిగ్ధావస్తనుండి తేరుకొనుటకు ఒకటే మార్గమా? ఏమంటే యిక నిరపేక్షక మొకటుండవలె, వున్నది, అను భావము తప్ప అన్యభావములు చేయుట మానుటయే లెస్సయా? అవును అది తెలియబడనిదిగావుండిపోవలసినదే. కాని సవిమర్శకమగు మానవబుద్ధి ఆగ గలదా. ఈ agriostic position తో తృప్తిచెంద జాలదు. కాని agriostic conclusion is self contradictory " అది తెలియబడదని తెల్సుకొంటిని" అంటారు. అనిరపేక్షకము యీ జగత్తు కు ప్రధమాధారము (substratum) అంటాడు అనిభావిస్తూ వెంటనే విరుద్ధంగా ఆవస్తువు భావాతీత మంటాడు. అదివున్నదనియైనతెలియవచ్చిందిగదా! యిక మానవవిజ్ఞానమునకది అందరాదనుట ఎట్లు?

ఈ నిరపేక్షక మావిధంగా మానవ విజ్ఞానంతో దాగుడు మూతలాడుచున్నది. అది " అయం" " ఇయం" అనువానికిన్ని " అస్తి నాస్తి' లకున్నూ అతీతం. అందుచే అది భావాతీతం. చైతన్యాతీతం. అయినను తెలియుదాని స్వభావమునకు విరుద్ధము.

-0-

## 18. అన్వయవ్యతిరేకములు

కుండచేయుటకు పూర్వము తడిమట్టియుండియుండవలెను. ఇది అన్వయపద్ధతి తడిమట్టిలేనిచో కుండకాజాలదు. యిది అన్వయవ్యతిరేకపద్ధతి కనుక తడిమట్టికారణము కుండ కార్యం.

ఈయుక్తిచే సౌఖ్యకారణమేది? అనివిచారిస్తే సౌఖ్యము పెంపొందిచు పరికరములున్నను యెల్లపుడు సౌఖ్యముకలుగుటలేదు. సుఖంపొందటానికి మనమనుకొనేవి నిజమైన కారణాలు కావన్నమాట. అంతేగాక మనపూర్వీకులు యీసుఖసాధనములులేనప్పటికి సుఖం మనకన్న యెక్కువ అనుభవించారుగదా? కనుక అన్వయ వ్యతిరేకయుక్తులచే ధన కనక వస్తు వాహనములు సుఖ హేతువులు కావనితేలుచున్నవి. నిజమగుసుఖమునకు, భౌతిక సంపదలకు కార్యకారణ సంబంధంలేదు. మన పూర్వీకులకు ధర్మాచరణయున్నది వారు సుఖపడిరి. మనకు ధర్మాచరణలేదు కనుక సుఖములేదు. కనుక అన్వయవ్యతిరేక యుక్తులచే ధర్మాచరణయే సుఖసాధననాలి. కావలసినవి

లేకపోయినా, అక్కరలేనివి పోకపోయినా సుఖంలేదు. కావలసినవి అనంతములు. పోవలసినవీ అనంతములే కనుక అవిరావు పోవు. ఒక్కడు ఆరోగ్యవంతునకు రోగం వచ్చిపోనక్కరలేదు. సుఖం అంటే దు:ఖం లేకుండుట. కాని దుఃఖం వచ్చి తర్వాత పోతేనే సుఖవంతుడంటామా? ఎప్పుడూ సౌఖ్యం వుంటేనే సుఖవంతుడంటాం, అంటే శాశ్వతసుఖం కావాలన్నమాట. దు:ఖమునకు లొంగకుండాలి. ఆకర్షణలకు మనస్సులొంగకూడదు.

ఉపాధిఆర్జన విసర్జనములకుఅంతములేదు. ఉపాదిఆర్జనమేప్రవృత్తి. ఉపాధివిసర్జనమే నివృత్తి.

1. ప్రవృత్తి - నివృత్తి స్మృతులు, పురాణములు.(భగవద్గీత)
   సాకామ్యము - నిష్కామము
   సక్తి - అసక్తి
2. సర్గము - అపసర్గము న్యాయవైశేషికములు
   దు:ఖము –నిశ్రేయసము
3. ఊహ - ఉపరమము యోగసాంఖ్యములు
   వ్యుత్థానము - నిరోధము
4. కర్మము– నైష్కర్మ్యము - మీమాంస
5. బంధము - మోక్షము - వేదాంతులు
6. సంచారము - ప్రతిసంచారము - జైనులు
7. తృష్ణ - నిర్వాణము - బౌద్ధులు.

యీద్వంద్వములకు - సర్వసంసారచక్ర పరిభ్రమణమునకు ఆత్మ నాత్మలుకారణము. సంసారచక్రములో మొదటి సగము ప్రవృత్తి. రెండవ సగము నివృత్తి. ఒక్కక్క జీవికొక సంపూర్ణ చక్రము. సమిష్టి చక్రము విశ్వచక్రము.

ప్రవృత్తి = ధర్మార్థకామములు

**శ్లో॥ నాను భూయనజానాతిజంతుర్విషయతీవ్రతాం।**
**నిర్వేదేతత్వయంతస్యాన్నతయాభిన్నధీ: పరై ॥** విష్ణుభాగవతం.

తా॥ విషయతీవ్రత గావించినగాని తెలియదు. కనుక వారినిమరల్చ ప్రయత్నించిన వారిస్వానుభవముచేతనే వారెరుగవలె.

కామిగాక మోక్షగామికాలేదు (వేమన)

" సర్వంసర్వత్ర సర్వదా"

" సర్వం సర్వాత్మకంవిద్ధి"

సృష్టికిపూర్వము బ్రహ్మాండమునంతను బ్రహ్మ తనమనస్సులో సంకల్పించెను. సంకల్పమే సృష్టి. కనుక బ్రహ్మమనస్సులో ఈసృష్టియొక్క భూత భవిష్యద్వర్తమానములన్నియుఎల్లపుడునుండును. ఈసర్వజ్ఞత్వము వేదమునందుండుటచే వేదము బ్రహ్మమునుండిపుట్టినదనిచెప్పుదురు.

# 19. గతితార్కిక భౌతికవాదం

హెగెలు(Hygel) = భావం ఒకప్రత్యేక వస్తువుఅనీ, యిది నిజమైనప్రపంచానికి సృష్టికర్తయనీ, భావంయొక్క బాహ్యదృగ్గోచర స్వరూపమే ప్రపంచమనీ హెగెల్ వాదన. కాని గతి తార్కికం యిందుకుపూర్తివ్యతిరేకం.

ఎదుటివాని వాదనలోని పరస్పరవిరుద్ధతలను బయట పెట్టి, వాటిని అధికమించి, సత్యాన్ని నిర్ణయించు కళయే గతితర్కం.

ప్రకృతియొక్క దృగ్గోచర విషయాలు నిరంతరం చలనం కల్గియుంటాయనీ, నిరంతరమూ మారుతుంటాయనీ అంటుంది. ప్రకృతి లోని పరస్పర వైరుధ్యాల అభివృద్ధి ఫలితంగా, విరుద్ధ శక్తుల పరస్పరసంసర్గం ఫలితంగా ఆకృతి వృద్ధిచెందుతుంది.

1. మెటాఫిజిక్సువలె గతితర్కం ప్రకృతిని పరస్పరసంబంధంలేని, విడివడిపోయిన, కలయికలేని దృగ్గోచర విషయాలుగా యాదృచ్ఛిఘటనల కుప్పగా పరిగణించిరి. దేనిలో వస్తువులు, దృగ్విషయాలు, ఆంగికముగా కలయిక కల్గి ఒకదానిపై ఒకటిఆధారపడుతూ ఒకదానిచేనొకటి నిర్ణయింపబడుతూ వున్నవో అట్టి కలయికగల అభిన్నసముదాయముగా ప్రకృతిని గతితర్కం పరిగణించుతుంది. అందుచే ప్రకృతిలోని దృగ్విషయాలనుపరిసరములనుండి వేరుచేసి, విడిగాచేస్తే అర్థంగాదు.
2. మెటాఫిజిక్సులో వ్యతిరేకంగా గతి తర్కం ఏముంటుందంటే. ప్రకృతి చలించనిదీ నిర్వికారమైనదీ కాలము. నిరంతర గమనము, మార్పు, నిరంతర పున:సృష్టిఅభివృద్ధి కల్గిన పరిస్తితియే ప్రకృతి. ప్రకృతిలోఒకే సమయంలో సృష్టిస్తితి లయాలు చెందుతుంటాయి.

దృగ్విషయాలు అన్యోన్య సంసర్గం, అన్యోన్య ఆధారం, దృగ్విషయాల గమనం, మార్పు, అభివృద్ధి,ఉనికిలోకి వచ్చుట, ఉనికిలోనుంచి పోవుట అనేదృక్పధాన్ని కూడాచూడాలి.

గతి తార్కికంలో అభివృద్ధి క్రమం ఒక చక్రగమనంగాదు. అదిముందుముందుకు పైపైకి పోయేగమనం. సాధారణ స్తితినుండి క్లిష్టస్తితికీ, నిమ్నస్తితినుండి వున్నతస్తితికి పరివర్తన చెందటం. ఇప్పటి మానవులు లక్షలాది సంవత్సరాలుగా పరిణామంచెందుతున్న అభివృద్ధి క్రమంయొక్కవుత్పత్తియే అని డార్విన్ నిరూపించాడు. పరిమాణపు మార్పులనుండి గుణాత్మక మార్పులకు పరివర్తనమే గతితార్కిక అభివృద్ధి. (సైన్సు కూడాఇది ఋజువుచేసింది)

ప్రతీవస్తువులోనూ ఆంతరంగిక వైరుధ్యాలు వుంటాయి. వాటన్నిటికీ negative, Positive (వ్యతిరేక, అనుకూల)ముఖాలుంటాయి. భూత భవిష్యత్తులుంటాయి. ఏదోచనిపోవుచున్నదీ వుంటాయి. ఆయావానిమధ్య పోరాటమే అభివృద్ధికి (గర్భస్థబీజంగా) కారణమవుతుంది. ఈగర్భస్తబీజమే గుణాత్మకమైన మార్పులకు దారితీస్తుంది. ఈ అభివృద్ధి క్రమంఘర్షణ రహితంగా, వికాసంపొందటంవల్ల జరగదు. అనిగతితర్కం చెప్పును. గతితర్కానికి నిర్వచనం- వస్తుసారంలో వున్న వైరుధ్యాల పరిశీలనయే( అధ్యయనం చేయటయే) అని లెనిన్ అన్నాడు. మరియు వైరుధ్యాల పోరాటమే అభివృద్ధి.

**అట్లేయీసూత్రాలు సమాజానికి వర్తింపజేస్తే ,**

1. శాశ్వతపునియమంమీద సూత్రాలమీద ఆధార పడరాదు.
2. సమాజం కూడా అభివృద్ధివైపు పురోగమించడం సహజం.
3. ఒక కాలంలో అత్యుత్తమం సహజములైన స్తితి తర్వాత తర్వాత వెనుకబడిపోయి, క్రొత్తఅవసరాలు క్రొత్త పరిస్తితులకు అనుగుణంగా మారుట సబబు సహజం.
4. విరుద్ధ శక్తుల పోరాటం వల్ల ప్రకృతిలో అభివృద్ధి తోస్తూవున్నట్లే సమాజంకూడా తనలోని విరుద్ధ శక్తుల పోరాటంరీత్యానే అభివృద్ధి గాంచును. అనగా గుణాత్మకమైన మార్పులు విప్లవంరీత్యానే సాధ్యం. కనుక నిరంతరం ఘర్షణ అవసరం
5. విప్లవ వాదమే సమంజసం కాని, సంస్కరణ వాదం సరికాదు.

## 20.మార్క్సిష్టు తాత్విక భౌతికవాదం

భావవాదం:- స్వయంభూశక్తి + విశ్వవిరాట్ + చైతన్యం

వీని ఆకృతియే ప్రపంచం అంటుంది. మనమనస్సు చైతన్యం తథ్యం. ప్రపంచ ఉనికి మనమనస్సులో భావాలలో దృశ్యమాత్రంగా మాత్రమే వుంటుంది

**భౌతికవాదం:-** ప్రపంచం స్వతస్సిద్ధంగానే భౌతికం- వివిధ దృగ్విషయాలు, పదార్థం యొక్కచలనంలో కల్గిన వివిధ రూపాలు. దృగ్విషయాల అన్యోన్య సంసర్గమూ పరస్పర ఆధారమూ, పదార్థ చలన సూత్రాలూ యివి ప్రపంచ వృద్ధికీ తోడ్పడతాయి. కనుక విశ్వవిరాట్ అవసరమేలేదు. ప్రకృతిని వున్నదున్నట్లుగా చూడటమే భౌతికవాదం. ప్రపంచాన్ని ఎవరూ సృష్టించలేదు. క్రమపద్ధతిగా ప్రజ్వరిల్లుతూ క్రమపద్ధతిగా ఆరిపోయే ద్వీపజ్వాల.యీసత్యం శాశ్వతసత్యం. ప్రపంచం, మనమనస్సుకుసంబంధం లేని బయటవుండే వాస్తవిక స్వతస్సిద్ధవస్తువుఅదేయింద్రియ జ్ఞానానికీ భావాలకూ చైతన్యా[illegible]కీ కూడా మూలపదార్థమై ఉన్నది చైతన్యపదార్థం నుండి పుట్టుతుంది కనుక అప్రధానం. అది పదార్థ ప్రతిబింబము. ఆలోచన పదార్థజన్యం. అదే అభివృద్ధిచెంది వున్నతస్థాయికి పరిపూర్ణతకూ చెందిన రూపమే మెదడు. మెదడు ఆలోచన యొక్క అంగము.

**ఉనికి:-** ఆలోచనఈరెంటికి, ప్రకృతికి, ఆత్మకునూ గల సంబంధం ఏమి? ప్రకృతికంటే ఆత్మప్రధానమని వాదించువారు భావవాదులు కానీ ఆలోచన ఎంతయింద్రియాతీతంగా పైకి కనిపించినా అదిమెదడునుండి పుట్టినదే. చైతన్యం పదార్థం వల్ల పుట్టిందికానీ పదార్థం చైతన్యంవల్ల పుట్టలేదు. ఆలోచించు పదార్థంనుండి ఆలోచనను విడదీయలేము. పదార్థం మన జ్ఞానేంద్రియాలపై పనిచేసి యింద్రియచలనం కల్గిస్తుంది. తద్వారా పదార్థమే కానవస్తుంది. జడప్రపంచం యదార్థము ప్రధానము, మానసికప్రపంచము అప్రధానం.

**భావవాదం:-** ప్రపంచాన్ని దానిసూత్రాలనూ తెలుసుకోవటం సాధ్యంకాదు. జ్ఞానంయొక్క ప్రమాణకత్వాన్ని నమ్మదు. బాహ్య సత్యత్వమును గుర్తించదు. శాస్త్రం తెలుసుకోలేని అగోచర విషయాలతో ప్రపంచంనిండివుందని భావిస్తుంది.

ప్రయోగంద్వారా పరీక్షచేయబడిన ప్రకృతిసూత్రాలను గురించిన మనజ్ఞానం ప్రమాణికమైనది.

ప్రపంచంలో తెలుసుకోలేని వస్తువులు లేవు. ఈనాడు కాకున్న ముందుముందు సైన్సు వానిని ఆవిష్కరిస్తుంది. ప్రకృతి క్రమాన్ని మనమే సృష్టించగల్గితే బుద్ధికి అందని అగోచర వస్తువు కలదనే వాదం ఎగిరిపోతుంది. (ఫీడిజం = శాస్త్రవిజ్ఞానాన్ని తిరస్కరించే అంధ విస్వాసం) సామాజిక అభివృద్ధి ఈభౌతిక శాస్త్రధోరణినే సాగుతుంది. అంతేకాని హఠాత్ సంఘటనల ఫలితం కాదు. కనుక మహోన్నత వ్యక్తులనబడేవారి కోర్కెలమీధ ఆధారపడదు. సబబు విశ్వజనీన నీతులు అనేవి ననుసరించరాదు. సమాజాభివృద్ధి సూత్రాలను మాత్రమే అనుసరించాలి.

-0-

## 21. నాగార్జునమతం ఔపనిషదమే

గౌతమ బుద్ధునికి పూర్వం బౌద్ధం అంటూ ఒక మతం వున్నదన్నసంగతి నిర్వివాదం. ఆబౌద్ధమునకు వేదంమూలం. వినయ పిటకమహా వర్గం లోధర్మచక్రప్రవర్తినవిభాగాన్కి రాహుల్ సాంకృత్యాయన హిందీ అనువాదం యిందుకునిదర్శనము.

గౌతముడు ప్రతీత్యసముత్పాదవాదం ప్రవచించాడు. దీనిని గూర్చిన అనులోమ, ప్రతిలోమ దర్శనం బుద్ధునికి జ్ఞానోదయం అయిన రోజుననే కల్గినది.

బ్రహ్మసూత్రచతుస్సూత్రి శంకరభాష్యంలో అద్వైతపు జ్ఞానంఅంతా వున్నట్లు ఈధర్మచక్ర ప్రవర్తనలోగా ప్రతీత్యసముత్పాదసూత్రంలోనూ గౌతముని బౌద్ధంఅంతా యిమిడివుంది.

బుద్ధుని తర్వాత 100 సంవత్సరాలకు బౌద్ధం 18 శాఖలైంది. వాత్స పుత్రీయులు అనుశాఖ వారుతప్ప మిగతాశాఖలన్నీ పుద్గలనాస్తి - అనాత్మత్వనైరాత్మ్యపుద్నలశూన్యవాదాన్ని అవలంబించారు.

అంతకుపూర్వం వున్నసాంఖ్య మతప్రధానాన్ని ఒప్పుకోలేదు. ఆంతరంగికమనోవిజ్ఞాన ధర్మాలు ఎట్లా అనిత్యాలో బాహ్యాయుతరం సర్వంగూడా అట్లాగే అనిత్యం. నాకించిత్ స్థాయి, సర్వం పృధక్ - యిట్లావాదించారు. తమవాదం సమర్థించుకోడానికి హేతుప్రత్యయ వాదం పేరులో బుద్ధుడు చెప్పిన ప్రతీత్యసముత్పాదవాదాన్ని తెచ్చుకొని అందులోంచి, క్షణికాత్మవాదాన్ని, విజ్ఞాన వాదాన్ని సర్వాస్తి వాదాన్ని ఆఖర్కి శూన్యవాదాన్ని సృష్టించుకొంటూవచ్చారు. ఏదీస్తిరంకాదు. ఏదీనిలవదు. ధర్మప్రవిచయంవల్ల ఇక్కడ ఏమీ మిగలడంలేదు, యిట్లా వాదించారు. ఒక్కవాత్సప్రుత్రీయులే మసక మసకగానైనా ఏదోఅస్తికాయంవున్నదని భావించారు. యీ18 శాఖలూ హీనయానమునకు చెందినవాళ్లే.

**మహాయానులు:-** హీనయానంలో, బుద్ధుడు మానవుడు. నిర్వాణంలో అంతమౌతాడు. మహాయానంలోబుద్ధుడు రూపుమాసిపోవటం యిష్టంలేక దైవత్వం ఆరోపించి శాశ్వతుణ్ని న్నిచేసారు మరిన్ని పుద్గల శూన్యత్వాన్ని అంగీకరించలేదు. ఎవరిమోక్షాన్ని వారు చూసుకోవాలనె సూత్రాన్ని కొట్టివేసితత్స్థానేప్రపంచోపశమత్వాన్ని అద్వయస్థితిత్వాన్ని తెచ్చిపెట్టారు. హీనయానంలో లోపించిన పరమార్థం, ధర్మకాయంగా మహాయానంలో అవతరించింది. దీన్నేవీరు అనపేక్షస్వభావము, సర్వధర్మశూన్యత అన్నారు. షర్‌బళ్‌త్స్కు అనువాదంలోయిది 'reality shown of all relations, reality in it self ' అయింది. ఏ ధర్మానికి ఆధర్మం శూన్యమే అయినా, ఈ సర్వధర్మసమాహార

స్వరూపంగా ధర్మకాయంవుంటోంది గనుక అందులో యీసమాధికరణ్యం లేక ఐకాధికరణ్యం ఏర్పడుతోందని మనం ఊహించుకోవాలి. బుద్ధునికి విరాట్స్వరూపాన్నిచేకూర్చి ఆస్వరూపంలో యీధర్మాలకు మహాయానులుఅభేదాన్ని చెప్పారు. ముందువున్న పంచస్కంధాలు, 12ఆయతనాలు, 18ధాతువులు వీరుతిరస్కరించక వాటికి స్వభావశూన్యతను చెప్పారు. యిందులోను ప్రతీత్యసముత్పాద సిద్ధాంతంవుంది. మొదటి బౌద్ధంలో సర్వధర్మాలు స్వతంత్రాలు యదార్థాలు. ఈ ధర్మంలో సర్వధర్మాలు పరస్పరాపేక్షలు గనుక శూన్యాలు. యిది (ప్రతీత్య సముత్పాద) సిద్ధాతంలో వీరుచేసినమార్పు.

**అజాతవాదం:–** మహాయానులు సంవృతిసత్యాన్ని, పరమార్థసత్యాన్ని అంగీకరిస్తారు. జగత్తా సంవృతిసత్యం అనే దానితో ఎవర్కీ పేచీలేదు. అజాతవాదాన్ని అంగీకరిస్తే సంసారానికి, నిర్వాణానికి వ్యవహారంలో భేదంచెప్పినా పరమార్థంలో సామానాధికరణ్యాన్ని అంగీకరించాలి. అంటే " సర్వంఖల్విదం బ్రహ్మ" అన్నదానికి దగ్గరగా రావాలి.

('there is no substantialdifference between సంసారం నిర్వాణ. The absolute nirvana is nothing but the world viewed speaibee for nitatid.) దీనినే కొందరు మహాయానులు పరినిష్పన్నస్వభావం అన్నారు. మాధ్యమిక కారికల నివ్యాఖ్యానంలో చంద్రకీర్తి " గగన పుష్పం, ఖరవిషాణం, కూర్మరోమ ప్రాకారం" అనిచెప్పబడింది. వ్యవహారిక జగత్తుయొక్క అనిత్యత్వం విషయంలో వైదికులకు శూన్యవాద భౌద్ధులకు తేడాలేదు. బుద్ధుడు అవతారాలు ఎత్తడంకూడావుంది.

బుద్ధుడు అవతారకాముడనే సాంఖ్యాచార్యుని వద్ద శుశ్రూషచేసినట్లు వినదూది పిటకాలలో వుంది. బ్రహ్మసూత్రాలను దృష్టియందుంచుకొనే బుద్ధుడు బ్రహ్మజాల సూత్రాంతాన్ని చెప్పినట్లని పిస్తుంది. సాంఖ్యులలోని మహతత్వవివరణం, భారత భాగవతాది గ్రంధాలలో వున్నందువల్ల బుద్ధునికి పూర్వపుదే ఈమహత్తత్వాది వివరణతో బుద్ధుని ప్రతీత్య సముత్పాద సిద్ధాతం పోల్చిచూస్తే మహత్తత్వాదికీవరణే ఉన్నతమైనదిగా కనిపిస్తుంది. బౌద్ధులప్రతీత్యసముత్పాద సిద్ధాంతంలో, అవిద్యలోనుంచి సంస్కారం, సంస్కారంలోనుంచి మరొకటి పుట్టాయి. కానీ అవిద్య ఎందులోంచిపుట్టిందో వీరుచెప్పరు. నాగార్జునుడూ చెప్పలేదు.

పుద్గల శూన్యత్వానికి, నాగార్జునుల ప్రతీత్యసముత్పాద సిద్ధాంత, ప్రాసంగిక వాదానికి తేడావుంది. గౌతముడు పరమార్థాన్ని వప్పుకోలేదు. వీరు వప్పుకొంటారు అనపేక్షాస్వభావమే పరమార్థం. సర్వభావాలు పరస్పరాపేక్షికములు గనుకస్వభావంచేత శూన్యాలంటారు. ఇది నిధి స్వభావము. మొదటి బౌద్ధులు పుద్గల శూన్యతను, నైరాత్మ్యాన్నిచెప్పగా నాగార్జునాదులు ధర్మనైరాత్మ్యాన్ని సర్వధర్మశూన్యత్వాన్ని స్వభావశూన్యత్వాన్ని చెప్పారు. శూన్యత అంటే అభావం( లేకపోవటం ) కాదు. ఇతరేతరాభావం. పరస్పరఅపేక్షత. జగత్తులో పరమార్థతలేదు గనుక అదిశూన్యం. అంతే కాని జగత్తు లేదనిగాని, జగత్తు శూన్యమనిగాని.మాధ్యమికులభావంకాదు అనివ్యాఖ్యాతలంటారు. అందుచేతనే లోకాన్ని సంవృతి సత్యంగా మాధ్యమికులు ఆమోదించారు." సంవృతి అంటే ముసుగు. ఆముసుగులోపల ఏదో పరమార్థంవున్నట్లే నాగార్జునాదులు అంగీకరించినారు" అని రాధాకృష్ణన్. కాని ఆపరమార్థం ఏమిటో వారెక్కడాచెప్పలేదు. నిర్యాణం పరమార్థం అనుకొంటే నాగార్జునుడు దానినీ శూన్యమన్నాడు.

పూర్వవ్యాఖ్యాతల **"నిరధిష్ఠాన విభ్రాంతేర భావాదాత్మనోఽస్తితాశూన్యశ్యాపి ససాక్షిత్వా దన్యధానోక్తి రస్యతే"** = తా॥ స్వరూపంలేనిశూన్యం భ్రాంతికి ఆధారంగానుండరాదు. ఆధారవస్తువు నాశ్రయింపని భ్రాంతి సంభవింపదు. కనుక జగత్కల్పనకు ఆధారుడగు ఆత్మగలడని అంగీకరింప వలెను. మరిన్ని శూన్యసాక్షిని అంగీకరించవలెను". ***(వేదాంత పంచదశి చిత్రరసప్రకరణం 74)***రి

నాగార్జునుల శూన్యవాదానికి అద్వయ వాదం అన్న పేరుకూడా ప్రసిద్ధం. నాగార్జునుడు వారిప్రార్ధన శ్లోకం..।

**శ్లో॥ అనిరోధ, మనుత్పాద**
**మనుచ్ఛేదమశాశ్వతం**
**అనేకార్ధ మనానార్థం**
**అనాగమ మనిర్గమం**
**యపి ప్రతీత్య సముత్పాదం**
**ప్రసంచోపశమమం శివం॥**

మాందూక్య." నార్త: ప్రజ్ఞం....... ప్రపంచోపశమం, శాన్తం, శివం
తైతి॥ బ్రహ్మవల్లి॥

" నిరుక్తంచా నిరుక్తంచ, నిలయనంచా నిలయనంచ, విజ్ఞానంచా విజ్ఞానంచ, సత్యంచానృతంచ సత్యమభవత్, యదిదంకించ, సత్సత్య మత్యా చక్షతే, తదప్యేషశ్లోకోభవతి"

కనుక నాగార్జునుల శూన్యం కూడా వైదికుల సత్యంలోదే.

అపర ప్రత్యయం శాంతం

అప్రపంచితం, నిర్వికల్పం అనానార్థం, ఏతత్త్వస్య లక్షణం అప్రహీణం, అసం ప్రాప్తం, అనుచ్ఛిన్న అశాశ్వతరా అనిరుద్ధం, అనుత్పన్నం ఏతన్నిర్వాణముచ్యతే,(మా.మా.కా)

-0-

## 22.బ్రహ్మవిద్య

అతీత విషయానుభవము, పరమ సత్యపదార్ధజ్ఞానము, అందువలన కలిగిన బ్రహ్మీస్థితి( ఆచరణ పద్ధతి) యివన్నియు బ్రహ్మవిద్యకు సంబంధించినవే. మాననీ వివేచన శక్తి పరమ కారణము నెరుంగనిదే వూరుకొనలేదు. ఈభావమునే మతాభిమానులు దేవుని పేరిట బాలుర కోమల హృదయములకు కూడా నెక్కింపగల్గిరేగాని వారు దానిని విమర్శించపూనుకొనుట లేదు. సాంప్రదాయ మత విస్వాసం మాత్రమే ప్రధానం కాదు. ఈమూఢవిశ్వాసమును వదలి విమర్శకు పూనుకొనినపుడే బ్రహ్మవిద్యయుద్భవించును.

కవి, చిత్రకారుడు, ప్రేమికుడు అంతా ఒకవిధంగా బ్రహ్మవిదులే

బ్రహ్మవేతృత్వంలక్షణములు:- 1. అతీత విషయ పరిజ్ఞానం 2. సర్వం ఖల్విదం బ్రహ్మ అనే అనుభవజ్ఞానం 3. ఆత్మప్రకాశ విజృంభణ.

ఉపనిషత్తులు వైదిక mysticismకున్ను, ప్రస్తుత mysticism కున్ను మధ్యనున్నవి. కనుక వాని ప్రకాశము ఇరు వైపుల ప్రవర్తించును.

బ్రహ్మవిద్యకు మూలం బ్రహ్మ పదార్థము. బ్రహ్మ అనగా అర్థము పెంపు, లేక విజృంభణ, చైతన్యవ్యాపకత్వము. యిది వ్యష్టి చైతన్యము కంటే భిన్నం కాదు. కనుక ఆత్మవికాశమే బ్రహ్మానుభవం. యీఆత్మ వికాసం దేశకాలావధులను మీరవలెను. అపుడే సాయుజ్యం. తానే దైవత్వం చెందినకాని దైవము పూర్తిగా తెలియ బడదు. మానసము మనీష కావలె.

ప్రతి వస్తువుకు మూడుదృష్టులచే కనుగొననగును.

1. అధ్యాత్మము = కర్తృదృష్టి from the stand point ofthe self

2. ఆదిభూతం = కర్మదృష్టి objective stand point

3. ఆది దైవతము:- అతీతదృష్ట్యా Transquantal out look

ఆత్మసాక్షాత్కారం త్రివిధం:-

1. వ్యష్టియాత్మయే శుద్ధచేతనము (అహంపదార్థ రహితమగు) అనియు అందే సర్వము అంతర్భూతమనియు అనుభవం కల్గుట.

2. తనయాత్మయే సర్వరూపాధుల యందుండు ఆత్మగా గుర్తెరుగగల్గుట.

3. ఐతదాత్మ్యమిదంసర్వం - సర్వముతానే అనుభావము.

వైదిక భావనప్రకారము - వరుణ, మిత్ర, అర్యములే వేదాంతము ప్రకారము సచ్చిదానందములు.

ఈసచ్చిదానందానుభవము ఊర్ధ్వ పరిణామాలరీత్యా 5రీతుల ఫలప్రాప్తిచెందును

1. భౌతికభివృద్ధిజీవసహాయముచే కాని సాధారణ మానవుడు మనస్సు కడ ఆగినిలచి పోవును. ఆధ్యాత్మిక దృష్టి యటనుండి

2. ప్రాణాభివృద్ధి మనోసహాయంచే యే ప్రారంభం.

3. మానసికాభివృద్ధి విజ్ఞాన సహాయం

మానసిక ప్రకాశమునకు హేతుర్భుతమగు విజ్ఞానంలేక ప్రకాశమును తెలుసుకొన ప్రయత్నించినచో కాని " అంతరావృత్తి" దృష్టిచేగాని యిది తెలియబడదు. (introvention = ఆవృత్తచక్షర్దృష్టి ). జ్ఞాతమగు జ్ఞేయమునకును ఐక్యము అనుభవంకావలె అపుడే ఆనందముద్భవము. యిది భక్తిచేగాని జ్ఞానముచేగాని కలుగ వచ్చును.

**రూపము:-** బాహ్యజగత్తుకును, నామము అంతర్జగత్తునకును, సంబంధం. కాని సమిష్టి దృక్పదంలో బ్రహ్మము సచ్చిదానందమును, నామరూపాత్మకమును గూడా నైయున్నది. నామరూపములను త్యజించి సచ్చిదానందమను సూత్రమును మాత్రమే స్వీకరించిన అదిజ్ఞాన మార్గమగును. లేక నామరూపములతో ప్రారంభించిసచ్చిదానందముకు దారితీయునగును. అపుడదిభక్తియగును.

# 23. వేదాంత ప్రశ్నోత్తరములు (శుక జనక) సంవాదము

1.ప్ర. స్వయంప్రకాశాత్మకు అంధకారస్వరూప అవిద్య ఆవరింపగలదా! అవిద్య లేదన్నచో తోచుచున్నది. మరిన్ని లేకుంటే గురుశాస్త్రాల ప్రయోజనంలేదు.

ఉ॥ కట్టెందు అగ్ని అణగినట్లు అజ్ఞానదశయందు బ్రహ్మమందవిద్య అణగియున్నది. జ్ఞానముచే ఆవరణ విక్షేపములతోపాటు కారణవిద్యకూడా దహించబడును.

2. ఆత్మఅవిద్యలకు విరోధములేదనుటెట్లు? దృష్టాంతరం: నిద్రావస్థలోనుండు చీకటి తేజోమయాత్మ విరోధములేనిచో అవిద్యకు నాశనమేలకావలె!

ఉ॥ తానేప్రతిఫలించిజీవుడనని భ్రాంతిచెందును. విచారణచే తాను సాక్షిననుజ్ఞానము (వృత్తి జ్ఞానము). అగ్నిరూపమగు సూర్యుడు దేనిని కాల్చదుగాని సూర్యకాంతముపై పడినపుడు అగ్నిపుట్టి దహించును. అట్లే జ్ఞానస్వరూపాత్మ అవిద్యను దహించదు గాని అంత:కరణ సంబంధమగు విచారణజ్ఞానము అజ్ఞాననాశనము చేయును.

3. ప్ర. కారణా విద్యయే కార్యమగు అంత:కరణరూపమైనపుడు దానిసంబంధ విచారణజ్ఞానమున్ను అవిద్యాకార్యమే. అందువల్ల అజ్ఞానమెట్లు నశించును?

ఉ॥ యినుమును ఉక్కుఖండించినట్లు.

4.ప్ర. నిద్రాసమాధులలో విచారణజ్ఞానము నశించునుగదా! నిద్రావస్థలో శరీరమేలపడిపోవును. సమాధిలో ఏలపడదు?

ఉ॥ సమాధియందు, వృత్తిజ్ఞానమునందు చిత్తవృత్తులణగి యుండును. నిద్రలో అజ్ఞానములో చిత్తవృత్తులు లయమగును.

5.ప్ర. 24తత్వములు జడములు. 25వ జీవుడు మిధ్యాస్వరూపుడు. ఆత్మనిర్వికారియిక కామక్రోధాదులెవరు సృజించిరి.

ఉ॥. అవిద్యయే.

6.ప్ర. జీవేంద్రియ మనస్సులే సర్వము నెరుగును. ఆత్మనుకూడా– యద్దృశ్యంతన్నశ్యం

ఉ॥. ఆత్మసర్వసాక్షి గనుక దాన్నెరుగుటకు యింద్రియములక్కరలేదు. స్వయంప్రకాశముగనుక మనస్సు అక్కరలేదు. స్వయముగాజ్ఞానస్వరూపముగనుక జీవుడక్కరలేదు. అయితే ఆత్మే, ఆత్మజ్ఞానముచేతనే, తన్నుబ్రహ్మమని ఎర్గును.

7.ప్ర. మాయస్వయముగానుండునా? పరాధీనముగానుండునా?

ఉ॥ రెండురూపములుగానూ యుండును. జీవేశ్వర జగత్తులకు తోచునట్లు చేయునుగనుక స్వయంగాను చేతనసన్నిధానమున చేతనముగాతోచుటచే పరాధీనమున్నూ అగును.

8.ప్ర. మాయను వంధ్య పుత్రుని వంటిదని మిధ్యయని జడమని ఏల అనవలె?

ఉ॥ చిద్బ్రహ్మకంటే వేరగుటవలన, జడము. అసత్యమగుటవలన వంధ్యాపుత్రువత్, అవిద్యాచ్ఛ్యమగుట వలన మిధ్య.

9.ప్ర. మాయ, జగత్తు, చిచ్ఛక్తి, బ్రహ్మము. వీనిని వేరుగా తెలియుటెట్లు

ఉ॥ మాయ = నామరూపములుతో పించునది. జగత్తు= నామరూపములతోనున్నది. ఛిచ్ఛక్తి = పరబ్రహ్మప్రకాశమే అంతర్ముఖమున చిచ్ఛక్తి – బాహిర్ముఖమున మాయా శక్తి ( సూర్యకిరణమే బహిర్ముఖమున మిధ్యాజలంగాను అంతర్ముఖమున యెండమావులుగాను తోచునట్లు)

బ్రహ్మము= సదానామరూపరహితము.

ప్రారబ్ధమున్నంతవరకుసోపాధికభ్రాంతియనునది తోచుచునేయుండును.

10.ప్ర. మాయా విద్యలు బ్రహ్మముకంటె అభిన్నములుగదా వానియందెట్లు ప్రతిబింబించును. మరిన్నిరూపములేని వస్తువుఎట్లుప్రతిబింబించును.

ఉ॥ అంతా ఆకాశమే అయినాఘటమెందెట్లు రూపములేకనే ప్రతిబింబించినట్లు.

11.ప్ర. సుషుప్తిలో జీవుని, ఆత్మను వేరుగా ఎట్లుతెలుసుకొందుము.

ఉ॥ నేను సుఖముగా నిద్రించితినన్నది జీవుడు. ఏమియు ఎరుగ ననేది ఆత్మ.

12. ప్ర. అన్నము భుజించునది ఏది?

ఉ॥ అగ్నిసంబంధ వుదాన వాయువు.

13. కర్తృత్వభోక్తృత్వములు బుద్ధిధర్మములు

14. ప్ర. జీవభ్రాంతి కర్తృత్వము నశించిన జ్ఞాని వ్యవహారములను ఎవరుచేయును.

ఉ॥ ఈశ్వరునిసమిష్టిశరీరంలో వ్యష్టిశరీరము భాగమే కనుక అద్దెకున్నవారు లేచిపోతే అసలువాడు యిల్లు జాగ్రతపెట్టుకొన్నట్లు.

15. వృత్తి = అంత:కరణము. వృత్తిజ్ఞానమెట్లునశించును.

ఉ॥ దీపమంధకారమును నాశనముచే సూర్యప్రకాశముఐక్యమైనట్లు.

16. ప్ర. జీవునిగానున్నపుడు దేహముగానున్నపుడు సాక్షిగానున్నపుడు బ్రహ్మమేతానన్నపుడు జగత్తు ఎట్లుదోచును.

ఉ॥ దేహంగానున్నపుడునిత్యం. జీవుడుగావున్నపుడునిత్యానిత్యం. సాక్షిగానున్నపుడు మిధ్య. తానే బ్రహ్మమన్నపుడుసముద్రమునకు తరంగములవలే.

17. ఆత్మ సర్వవ్యాప్తి అయితే సర్వశరీరవిషయము లెరుగవలదా?

ఉ॥ ఉపాధిలో నున్నందున ఆశరీరవిషయములే ఎరుంగును

18.ప్ర. సత్ చిత్ ఆనందములు మూడూ వేరా ఒకటా

ఉ॥ ఒకటే మల్లె తెలుపు వాసన మూడూ ఒకటైనట్లు, కాని అంత:కరణ త్రిగుణాత్మిక. దీనికి శాంత, ఘోర, మూఢవృత్తులు.

-0-

## వాదములు

1. ఆరంభవాదం –జగత్తుపుట్టెననుట – తల్లి, పిల్ల వలె వేరుగాలేదు గదా.
2. పరిణామవాదం – పాలు చెడి పెరుగైనట్లు బ్రహ్మముచెడలేదు.
3. కార్యకారణవాదం – మన్నుకుండైనట్లు బ్రహ్మము వికారికాలేదు.
4. ప్రతిబింబవాదము – సూర్యుడు వికారపడకయే ప్రతిబింబిచినట్లు – బ్రహ్మము ప్రతిబింబిచుటకు జలము వలె ఆధారములేదు. ఒకటి మరొకదానియందు ప్రతిబింబించుట పూర్ణత్వహాని.
5. వివర్తవాదం – శుక్తిరజితం. బ్రహ్మంకంటె జగత్తు వేరుకాదన్నను, ప్రపంచమున్నదని వ్యవహారమున్నది.

   ఎండమావులు – జగత్తులో అనుభవమున్నది.

   స్వప్నంవలె – సరిపోయిందా.

# 24. శ్రీవిద్యోపాసన ( శ్రీచక్రోపాసన )

ఉపాసన జ్ఞానోత్పత్తి దాయకంకాదు. ఐనా చిత్తమును భావనాయుక్తంగాచేయును.
భావనలేని ఉపాసన ప్రాణహీనము. " తజ్జపస్తదర్ధభావనం"
" తత:ప్రత్యక్చేతనాధిగమో2న్తరాయంభావశ్చ "యో॥ద॥
" ధ్యానే నాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మానా"
" ఆత్మసంస్థం మన: కృత్యానకించి దపిచింత యేత్"

కనుక జీవబ్రహ్మైక్యజ్ఞానము మాట కందనిది. అవియుత్తమ ధ్యాన భూమిక. యిందున్న జీవునికి క్రమశ: అహంకార దేహాభిమానములు క్రమంగా సన్నగిల్లి బ్రహ్మవృత్తి పెంపొందును. కనుకనే " యస్త్వాత్మరీతి రెవస్యాదాత్మతృప్తస్చమానవ:"

"ఆత్మన్యేవచసంతష్టస్తస్యకార్యం నవిద్యతే" గీ॥

శక్తి. శక్తి మంతులకభేదము

ఆబ్రహ్మశక్తియే, బ్రహ్మాండమందు సమిష్టి కుండలిని. పిండాండమందు వ్యష్టి కుండలిని. ఆమెయే సంవిత్సరూప శుద్ధవిద్య. ఆమెప్రతీకయే శ్రీచక్రము.పిండమందలి షట్చక్రములు, ఇడా పింగళా సుషుమ్నానాడులు మున్నగువానియందలి దేవతాశక్తి కేంద్రములు సహాయముచే యోగ సాధన క్రమము అంతర్యాగమనబడును. అపుడీ దేహమే(శ్రీయంత్రము) ( టఅతీర్ 4 ంశ్రీశీస్ఝం శీట సౌంద్యలహరి). అంతర్యాగము సంధ్యావందనమందు నిగూఢముగానున్నది. గాయిత్రి విద్యయే శ్రీవిద్య . (పరివస్యా రహస్యము చూడుము )

" శ్రీగురుః సర్వకారణ భూతాశక్తి: వందే గురుపదంద్వం వాగ్మనోతీత గోచరం. శ్వేతరక్తప్రభాభిన్నం

శివశక్త్యాత్మకం పరం:- రక్త, శుక్ల ప్రభామిశ్రమ తత్వం. త్రిశక్తులు. ఇందలి, గురు, శివ, విశిష్ఠ, శుక్ల ప్రకాశశక్తి బ్రహ్మము. శుక్లము, విమర్శ శక్తి, మూలప్రకృతి ప్రధానము. " జాయతేగచ్ఛతేయితి జగత్"

ఈ శక్తియుత శివమూర్తికేపరాపాదుక అనిపేరు. "స్వప్రకాశ శివమూర్తి కేకికాద్విమర్శ తను దేకికా తయో: సామరస్యవపురిష్యతే పరపాదుకాపరశివాత్మనోగురో:" అనిపాదుకానిర్వచనము.

శక్తి స్వరూపవాక్కే( పరావాక్కు) సర్వమునైనది "వాగేవవిశ్వాభుపననానిజిజ్ఞే" "వాచైవవిశ్వం బహురూపంనిబద్ధం"తదేతదేకంప్రనిభజ్యోపభుంక్తే" వాక్కేచిచ్ఛక్తి.

| ఓం = | అ | ఉ | మ్ ( ప్రణవాంగములు ) |
|---|---|---|---|
| | హరి | హర | బ్రహ్మ |
| | అగ్ని | వాయు | సూర్య ( దేవతలు ) ఋషులు |
| | గాయిత్రి | త్రిషుప్ | జగతీ ( చందస్సులు ) |
| | రక్త | శుక్ల | కృష్ణ ( వర్ణములు ) |
| | జాగ్రత్ | స్వప్న | సుషుప్తులు ( అవస్తలు ) |

| | | |
|---|---|---|
| భూమి | అంతరిక్ష | స్వర్గములు ( స్థానములు ) |
| ఉదాత్త | అనుదాత్త | స్వరితములు ( స్వరములు ) |
| ఋక్ | యజుస్ | స్సామము ( వేదములు ) |
| గార్హపత్య | ఆహవనీయ | దక్షిణములు ( అగ్నులు ) |
| ప్రాహ్ణ | మధ్యాహ్న | అపరాహ్ణ ( కాలములు ) |
| సత్వ | రజస్ | తమస్సులు ( గుణములు ) |
| సృష్టి | స్థితి | సంహారములు |

ఇక్షుధనస్సు పుష్పబాణములు
ధనస్సే మనస్సు 5 పుష్పబాణములు పంచతన్మాత్రలు
శివశక్తులసమాగమమే యోగము.

## 25. సంధ్యావందనము

**"ఆయాతువరదో దేవీ అక్షరంబ్రహ్మ సమ్మితం"** మొదలు "బ్రహ్మణేభ్యోఽభ్యనుజ్ఞాత్వా **గచ్ఛదేవీయధాసుఖం"** -ద్విజులు గాయిత్రీ నామపరాశక్తినుపాసింప వలసిన యోగులు. అంతరయాగమే వీరు వడుగునాటి నుండిసాధింపదగు సమయాచారము. ఈఅంతరయాగ ప్రక్రియలేనిచే సంధ్యోపాస్తివ్యర్థమే.సంధ్యావందనము శ్రీవిద్యోపాసనమే. ద్విజులకు మాత్రము సంధ్యోపాస్తియిందుకే.సర్వజాతులవారికి శ్రీవిద్య ( గుప్తతరగాయిత్రి ) శ్రీవిద్యయన బ్రహ్మవిద్యయే. స్త్రీ విద్యఅనివాడుట పొరపాటు. ధ్యానయోగమభ్యసించనిచో భగవద్గీతపారాయణమునట్లేవ్యర్థము.

**తత్వత్రయము:-** 1. ఆత్మతత్వ 2. విద్యాతత్వ 3. శివతత్వ

36 తత్వములు జడతత్వ జడప్రకాశమిశ్ర పురుష, కలాకేవలప్రకాశ శుద్ధవిద్యామహేశ్వర మనసాది 24 తత్వములు విద్యరాగవిచ్ఛక్తి నియతి మాయ సదాశివశక్తి శివ (5 ) మొత్తం 7

మాతృకావర్ణములు 50 యు 20 ఆకృతులుగా 1000 దళములననుకరించును.

1. **మూలాధారము -** భూతత్వ - శ్రీచక్రత్రికోణము. భేధించుట అనగా జయించుట జయించినయోగి గట్టిగోడను సైతము దారిచేసుకొని పోగల్గును.

2. **మణిపూరకము:-** సమయాచారులీచక్రమునకు దేవిని తెచ్చి మానసికోపచారములతో మణ్యాభరణములనర్పింతురు. కనుక నీపేరు. జయించినవాడు నీటిపై దేలును.

3. **స్వాధిష్టాన:-** అష్టకోణ(శ్రీచక్ర)
అట్లే ఆచక్రమును జయించినవారికి పంచభూతలయము లభించును.

6. **ఆజ్ఞా =** మనస్సు ఆజ్ఞపెట్టబడును. దూరదృష్టి దూరశ్రవణాదులు గల్గును. ఆజ్ఞాది సహస్రాంతము చంద్రమండలము.

సిద్ధాంత శిఖామణి ( శైవాద్వైత గ్రంధము ) 36 తత్వ = శివ, శక్తి, సదాశివుడు.

శుద్ధవిద్య, మాయా కలా, నిర్వ్యారాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, అహంకార, మనస్సు, బుద్ధి శ్రోత్ర త్వక్కు చక్షు జ్జిహ్వ ఘ్రాణ వాక్పాణి పాద పాయు ఉపస్త శబ్ద స్పర్శ రూప రసగంధ ఆకాశ వాయు అగ్ని జల పృధ్వులు

శక్తియుత పరబ్రహ్మ "బహస్యాం ప్రజాయేయ" అనుసంకల్పము యిచ్ఛాశక్తి అదియే జ్ఞానశక్తి గాను క్రియాశక్తి గాను మారెను. యిచ్ఛాశక్తికి జ్ఞానశక్తి అంతరంగము, క్రియాశక్తి బహిరంగము. క్రియాశక్తియందుచేరి నేను సర్వకర్తను అనెడి అభిమానమునొంది శక్తి తత్వమనబడుచున్నది. "అహమిదం" నేనే యీ ప్రపంచము అనెడి అభిమానము నొందగా సదా శివ తత్వమనబడును అనగా ఈశ్వరతత్వమనబడును. "అహమిదం" అనే అహంకార మునకు యిది అనే ప్రపంచమునకుభేదము లేదనెడి జ్ఞానమునొంది శుద్ధ విద్యాతత్వమనబడును.

శుద్ధ విద్యాతత్వముగా మారిన శక్తితత్వము మయూరాండ రసన్యాయముగా తనయందణగి యుండిన ప్రపంచనిర్మాణ కారణమైన సూక్ష్మభూత పదార్ధములందు అన్యోన్యభావమనెడి (ఒండొకటి యొక్కలేమి ) భేద బుద్ధి ప్రాధాన్యముతో మాయాతత్వమనబడుచున్నది. కలావిద్యారాగకాల నియతులనే ఐదు తత్వములు పురుషునకు కంచుకరూపముగానుండును. కఱ్ఱల రాపిడిచే అగ్ని కణములు పుట్టినట్లు పరమ శివుడు యిచ్ఛాశక్తిని కూడుటచే గలిగిన శివాంశమే మాయాశక్తినందు ప్రవేశించి పురుషతత్వమనిపించుకొనును. ఈ పురుష తత్వమునకు మాయా మల సంబంధముండుటచే ఆత్మయందు అనాత్మజ్ఞానము, అనాత్మయందు ఆత్మత్వజ్ఞానము " నేను సుఖిని దుఃఖిని " అనే బుద్ధి గల్గును. పురుషుడీ రీతిగా ఆణవ కార్మిక మాయిక మలములతో గూడి జనన మరణములు పొందును. అందుచే సర్వ కర్తృత్వ సర్వజ్ఞత్వ పూర్ణత్వ నిత్యత్వ వాపకత్వము లను మరచి కించిజ్ఞాత్వ గుణుడగును. యీకించిత్కర్తృత్వరూపశక్తి కలా తత్వ మనబడును. కించిత్వ రూప శక్తియే విద్యాతత్వమనబడును. అపూర్ణత్వ రూపశక్తియే విషయాదుల ప్రీతిరూపకమగు రాగతత్వమనబడును. అనిత్యత్వ రూపశక్తి = కాలత్రయతత్వము. అవ్యాపతత్వ శక్తియే కార్య కారణ భావము మగును నాయందుబుట్టినది కాదు అనే అయదార్ధాజ్ఞానము నకు హేతువగుకించితత్వము.

కార్యోముఖంచేయు యిచ్ఛాశక్తి తనయందున్న జ్ఞానక్రియాశక్తిల యందుండి " జ్ఞానం క్రియా నభవతి క్రియాజ్ఞానం నభవతి " అనెడి భేధబుద్ధిప్రధానమైన మాయాతత్వ మందు ప్రతిస్ఫురించి ప్రకృతి తత్వమనబడును. ఈ ప్రకృతితత్వం, గుణత్రయ సామ్యావస్తయందుండి మహత్తత్వమనబడును. ఈ 13 తత్వములు సృష్టికి మూలకారణం. ఈప్రకృతి " ఇదమిత్థం " అనే నిశ్చయరూప బుద్ధియై వ్యావహారిక మహత్తత్వ మరియొకపేరు. బుద్ధిరూపశక్తియే " నేను నాది " అనే అహంకార మమకారములకు కారణమను అహంకారతత్వమనబడును. ఈఅహంకారరూపశక్తి " స్థాణుర్వా పురుషోవా " అను సంకల్పాత్మక మనస్సాయెను. బుద్ధ్యహంకార మనస్తత్వములు కలిసి అంత:కరణయే. ఇది యిచ్ఛాశక్తి ప్రధానము. ఈ అంత:కరణ బాహ్యాశరీరమవలంబించి జ్ఞానేంద్రియములాయెను. అందుండి వాగాది కర్మేంద్రియములు. ఈ శక్తితత్వమే జ్ఞానేంద్రియ గ్రాహ్యములగు శబ్దాదితత్వములైదు నాయెను. శక్తిత్వమునుండి పంచభూతములాయెను. శిక్ష, వ్యాకరణ, చంధస్సు, నిరుక్తము, కల్పము,

జోతిష్యము అను నాల్గు వేదములు పూర్వ ఉత్తర మీమాంశలు, న్యాయ, పురాణ, ధర్మశాస్త్ర నీతిశాస్త్రములు, ఆయుర్వేద, ధనుర్వేద గాంధర్వ వేదములు.

పాశబద్ధ స్తథాజీవ: పాశముక్త: సదాశివ:, పాశబద్ధ: పశు: ప్రోక్త: పాశముక్త: పశుపతి:. గోత్రమనగా యింద్రియ సంయమము. "గాంత్రాయతే యితిగోత్రం"

**సమయాచారము:–** దహరాకాశమునందు శ్రీచక్రమునుభావించి ఇచ్చట చేయుపూజాదికము సమయాచారము. వశిష్ట శుక సనకసనందన సనత్కుమార తంత్రపంచకమునకు సమయవ్యవహారము. శివునికి సమగాచెప్పబడుటచే దేవి సమయాదేవి అనబడును. మణిపూరకమున పాద్యాది భూషణాంత పూజ అనాహతమున అటనుండి తాంబూలాంతపూజ. ఆజ్ఞాచక్రమున నీరాజనము. సహస్రారమున శివునితో సంయోగింపబడి మరల మూలాధారమును సమయమువరకు వేచియుండుట సమయాచారము. అదిఅభ్యసించుసాధకులు సమయాచారులు, సమయులు, సామయకులు.

## 1. శివశక్త్యాత్మకు ప్రథమ స్పందము – ఆజ్ఞాచక్రమునందును అధిష్టానదేవతలు

సదాక్యమైన అర్ధనారీశ్వరుడు – విశుద్ధమందును

ఈశ్వర రుద్ర విష్ణు బ్రహ్మలు దిగువ 4 చక్రములందును.

రుద్ర విష్ణు బ్రహ్మలు శుధ్య విద్యాంతర్గతులు; జీవుడు పురుషుడు మాయాంతర్గతుడు. మిగతా 24 తత్వములతో గూడిన దేహము అశుద్ధ విద్యాంతర్గతము. అశుద్ధ విద్యారూపమే శుప్తకుండలిని.

"దేవోభూత్వ దేవంయజేత్ " = దేవుడవై దేవుని భజింపుము.

సంసారబంధమున కట్టువడినవాడు పశువు, రాగమనెడి త్రాడే సంసారమనెడికొయ్యకు కట్టునది.

అష్టపాశములు:– ఘృణా, లజ్జ, భయ, నింద, శోకము, జాతి, కులము, శీలము.

భావనోపనిషత్తు = రాగము (మోహము ) పాశముగా చెప్పబడెను.

–0–

# 26. నీతిచాలదా? వేదాంతమెందుకు?

విశ్వకారణము, సర్వప్రాణుల ఏకత్వము, మానవునియందలి దేవత్వము యివి హిందువులందర్కి తెలిసిన ప్రాథమిక మత సిద్ధాంతాలు. వీనినాచరణలో పెడితే సహజంగా మనకు పాశ్చిమాత్యుల సద్గుణాలేగాక, కాలముయొక్కవిలువ, సినిమా, సెక్సు, శాస్త్రీయనిపుణత అన్నియు మనకు లభిస్తాయి. పాశ్చాత్యుల నైతికజీవితం మంచిదే. కాని నీతి ఫధమెందుకు. దానివెనుక అంతర్గతముగానున్న సూత్రములేవి? అంటే వారు చెప్పలేరు. మనము మూలసూత్రాలు ఏకరువెడతాము. కాని ఆచరణపూజ్యం. పాశ్చాత్యునీతికాతడు వశుడై వుంటాడు అంతేగాని దానివల్ల అతనెట్టి సహాయము పొంది పురోభివృద్ధినొందడు. కనుక ఆతడెన్నడు సంపూర్ణసిద్ధినొందజాలడు. మూలసూత్రములు

తెలిసిననే సంపూర్ణత సిద్ధించును. పాశ్చాత్యుల నాగరికత వర్తనలో అంత:కరణశుద్ధిలేక త్రికరణశుద్ధిలేదు. పయోముఖ విషకుంభము.

పాశ్చాత్యుల అనుకరణవల్లగాక నైతిక సాధనల మూలసూత్రముల పునాదులపై నిర్మింపబడవలెను. లేదా అది కృత్రిమమైపోవును. మూలసూత్రము తెలిసాక నైతికముగా సహజ ప్రవృద్ధిపొందును.

చైనాభాషలో టావు అనుమాటకు = బ్రహ్మము + బ్రహ్మీస్థితి + బ్రహ్మవేత్త ఆచరణ, కలిసినంత అర్థము కలదు. అనగా జ్ఞాన విజ్ఞానముల ఏకత్వం' టావు ' లేకపోతే ధార్మికబుద్ధి అలవాటుచేస్తాడు. జ్ఞానికి సత్కారంజరిగితే వేషగాండ్లు ఎక్కువౌతారు. కుటుంబములో విభాగములు వచ్చినతరువాతనే పరస్పర ప్రేమవృద్ధిచెందును. జాతిలో విద్వేషములు పెరిగినపుడే దేశభక్తులు బయలుదేరుతారు. మనము మనలకు సంస్కరించుకొనుటకై యితరులనను సరించుట అతుకులబొంత కాకుండా అనగా మూల సూత్ర పునాదులపైనే నైతికసౌధనిర్మాణముచేయాలి.

-0-

ఓం

శ్రీ గురుభ్యోనమః

"పరిపూర్ణ దర్శనాచార్య సదానంద"

## శ్రీ యిలపకుర్తి వీరవెంకట రామచంద్రరావు గారి

### రచన గ్రంథముల వివరములు

| | | వెల రూ. |
|---|---|---|
| 1. | పరిపూర్ణ దర్శనం | 40.00 |
| 2. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత పరంపరా గురువుల జీవిత చరిత్ర | 15.00 |
| 3. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము వేదాంత కథలు | 15.00 |
| 4. | భ్రాంతిరహిత శ్లోకములు - సవ్యాఖ్యానము | 12.00 |
| 5. | నిఖిలవేదాంతార్థనివహము | 12.00 |
| 6. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంతము ( జాబులు- జవాబులు) | 20.00 |
| 7. | శ్రీ శివరామ దీక్షితీయ సూక్తి ముక్తావళి | 20.00 |
| 8. | గురుస్తోత్రము ( మొదటి భాగము ) | 25.00 |
| 9. | గురుస్తోత్రము ( రెండవ భాగము ) | 25.00 |
| 10. | అచలము - వేమన | 5.00 |
| 11. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి ( మొదటి భాగం ) | 15.00 |
| 12. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి ( రెండవ భాగం ) | 15.00 |
| 13. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి ( మూడవ భాగం ) | 17.50 |
| 14. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత వ్యాసమంజరి ( నాలుగవ భాగం ) | 18.00 |
| 15. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము ( మొదటి భాగం ) | 12.00 |
| 16. | పరిపూర్ణ రాజయోగ సిద్ధాంత శిరోభూషణము (రెండవ భాగం ) | 15.00 |
| 17. | బాలల బోధ | 5.00 |